ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/24 ఆసఫ్ ఆలీ రోడ్డు, కొత్తఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లా మందిర్ రోడ్డు, పాట్నా 800 004
పాటియాలా హౌజ్, 16-ఎ, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి. గోస్వామి రోడ్డు, పాన్ బజార్, గౌహతి 781 001


**ISBN 0 86125 953 X**

ప్రచురణ
ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

లైప్ సెట్
మాస్టర్ గ్రాఫిక్స్, లక్డీకాపూల్, హైదరాబాద్ 500 004.

ముద్రణ
కార్డుబాక్స్ కంపెనీ, నాంపల్లి స్టేషన్‌రోడ్, హైదరాబాద్ 500 001

# నా మాట

## 1

ఏ నాటివో ఈ నాటికలు !
ఎప్పటివో గాని ఈ పద్యాలూ, పాటలూ
ప్రసంగ వ్యాసాలూనూ!
ఎప్పుడెపుడో గిలికినవీ బరికినవీని.

దూరాన నుంచి వెన్నంటి వచ్చాయి. ఎవరో చిరపరిచితుడైన బాటసారి పదధ్వనులు లాగున – నన్ను వదలకుండా!

## 2

మా అన్నగారు శ్రీ శివశంకర స్వాములు నా "కృష్ణపక్షము" 1925లో అచ్చు వేయించేసేరు. అప్పటికి ఆయనకు అందిన నా పద్యాలన్నీ – కొన్నిటిని వదలివేయాలని నేనంటున్నా వినక – ఒక ధోరణిలో కూర్చి, తమ సింహావలోకనంతో ముద్రింపించేసేరు. 50 ఏళ్ళు అయింది. అలాగే నా సోదరుడు ముద్దుకృష్ణ 'ప్రవాసము–ఊర్వశి' అనే గ్రంథాన్నిని – 1929 లో. ఎవరో ఒకరు తామే పట్టుపట్టి పూనుకుని చేయించాలి, నా చేత ఏ మంచిపని అయినా.

దాదాపు పాతిక సంవత్సరాల క్రితం ప్రారంభం – నా రచనలు అచ్చు వేయించి తీరాలని ఆప్తులు ఒత్తిడి చేయడం. ప్రాణాధికులైన కాటూరి వేంకటేశ్వరరావు, మరి పాలగుమ్మి పద్మరాజు, ఎస్.బి.పి. పట్టాభిరామారావు, ఎమ్. ఆర్. అప్పారావు, నార్ల

వేంకటేశ్వరరావు మొదలైనవారు - అచ్చుకాని నా రచనలన్నీ పుస్తకరూపాన ప్రకటించాలంటూ గట్టిగా పట్టుకునేవారు. ఇక నా ఆప్తమిత్రులు బెజవాడ గోపాలరెడ్డికి కనబడడం భయం 'యేవండీ పుస్తకాలు?' అని మొట్టమొదటి ప్రశ్న. అయినా పదుగురిలో వీనిని పడవేయడం పడలేదు.

3

ఏదో బెదరూ, భయం !

వల్లమాలిన బద్ధకమూ.

కొంతవరకు, జమీందారీ సావాసం వల్ల వచ్చిన ఉపేక్ష కూడాను.

తరుముకు వచ్చిన ఏ రేడియో ప్రోగ్రాంకో ఆ సమయానకు, గబగబ ఏ రజనీకాంతరావుకో, శివరామారావుకో, కురిమెళ్ళ వేంకట రావుకో నేను చెప్తుంటే వ్రాసినవీ, లేదా ఏ ప్రయాణంలోనో, నడుస్తూనో చిన్న చిన్న కాగితాల మీద వంకర టింకరగా గీసినవీ రకరకాల రచనలు ఇవి.

మరి అచ్చు వేయించాలంటే తిరిగి ఒకసారి చదువుకోవాలి. సంస్కరించాలి -సాధ్యమైనంతవరకు ఏ లోపమూ లేకుండా నిర్మించాలి - ఇది నా సంకల్పం. పద్మరాజు నిర్మొగమాటి. ఖచ్చితంగా "ఇది బాగుంది, ఇది బాగా లేదు" అని చెప్పేస్తాడు- ఎవరి రచన అయినా సరే ! గొప్ప మేధావీ, సాహిత్య రసవేత్త, రసజ్ఞుడు-అతగాడే వీనిని వేయమంటున్నాడే !

ఇంతలో మూగతనం వచ్చిపడింది నాకు.

Grow old along with me అని బ్రౌనింగు చాలా ఉల్లాసంగా అన్నప్పటికీ, ముసలితనం చెడ్డది.

ముసలితనంలో మూగతనం భయంకరం - శిథిలమందిరంలో అంధకారం లాగున.

ఏదో తోసేస్తున్నాను బ్రతుకు - 'దినములు పరస్పర ప్రతి ధ్వనులుగాగ' - ఆనాటి మా వేదుల లాగున.

I am like the road in the night listening to the footfalls of its memories in silence అని రవీంద్రు డన్నట్లు-

'దీపకాంతిలో కిటికీ
దిగువ నెవ్వరా గోష్ఠి'
నేను - నా నీడ'
అని నళినీ కాంతరావు అన్నట్లు.

4

ఇలా ఉండగా 1964లో నా ప్రాణమిత్రుడు దొడ్ల రామచంద్రారెడ్డి హైదరాబాదు వచ్చి నా వచనరచనలు కొన్నిటిని తమ్ముడు ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి చదువుతుంటే విని, నా వైపు చూడకుండా, వానిని అలాగే పట్టుకొని పోయి, కావలిలోని విశ్వోదయ సంస్థద్వారా అచ్చు వేయించేసేడు- నాకు మాత్రం ఎందుకో నా వచన రచనలు నా పద్యాలకీ గేయాలకీ తీసిపోవు అనిపిస్తుంది.

అయితే, పద్యాలూ, ఎన్నో గేయాలూ, నాటికలూ, యక్షగానాలు, వ్యాసాలూ ఉండిపోయాయి.

5

ఇంతలో ఒకాయన నా జీవితంలో ప్రవేశించాడు. చీకటింటి కిటికీలూ తలుపులూ తీసి వసంతకాలపు ప్రభాత వాయువు లాగున. ఈయన ఎవరిద్వారా విన్నాడో నా సంగతీ, నా రచనల

సంగతీని :– నాతో అనలేదు, నన్ను అడగలేదు – ప్రముఖులూ పెద్దలూ అయిన కొందరితో సంప్రతించి ఒకసంఘం ఏర్పరచాడు– నా ప్రియసోదరుడు మామిడిపూడి ఆనందం తనకన్నా ఉత్సాహంగా, పట్టుదలతో ఉన్నాడనీ – అంతే కాదు, నా పరమగురువులు వెంకటరంగయ్యగారు కూడా ఆదేశించారనీ, తమ యత్నాన్ని ఆశీర్వదించారనీ అన్నాడు –

ఈయన శ్రీ పి.వి. రమణయ్య – స్నేహితులం అందరమూ 'రాజా' అంటాము. 'నేనేమీ చదువుకోలేదు, నాకేమీ తెలియదు' అంటూంటాడు. అదేమో నాకు తెలియదు గాని, అతనికి ఒక వింత సంస్కారం ఉంది, అతని మూర్తికి సుకుమారమైన ఏదో పరిమళం వంటిది ఉంది; నన్ను చాలా గాఢంగా ఆకర్షించింది –

కాగితాల ధర భయంకరంగా ఉన్న ఈ రోజులలో కొన్ని సంపుటాలకు సరిపోయే కాగితం కొని ముందే తెచ్చేశాడు. ఎవ్వరూ చేయని పని, చేయలేని పని ఈయన చేసేశాడు.

ఈయనకు మరొకరు తోడయ్యారు, అసాధ్యుడు, శ్రీ యం.యన్. రావు గారు. అచ్చు వేయించే భారం తన మీద వేసుకున్నాడు –అసలు అచ్చుగాని తెనుగు గ్రంథం ఈయనకు అందడం భయం :– ఎంత అభిమానం నా యెడ ఉంటే, ఎంత మక్కువ ఆంధ్రసాహిత్యం మీద ఉంటే, అంత పనుల ఒత్తిడిలో, ఈయన ఈ పనికి పూనుకుంటాడు!

ఇద్దరూ కలిసి నా వద్ద ఉన్న రచనలను – చిత్తు కాగితాలనూ, చిల్లర పీలికలనూ – పట్టుకొని వెళ్లిపోయారు.

వీరికి ఎంత శ్రమకలిగించానో ! కృతజ్ఞుణ్ణి అని వేరే చెప్పి వీరికి అన్యాయం చేయను.

మరి - రాజాకీ, యం.యన్. రావుగారికీ నాకూ మధ్య, నళినికీ నాకూ మధ్య ఆసులో కండెలాగున తిరుగుతూ, మిత్రుడు శ్రీ ఆర్.కె.రావు. తన పనులన్నీ మానుకుని తెగ కష్టపడుతూ, నన్ను విశ్రాంతిగా ఉండనీయక తాను విశ్రాంతి తీసుకోక, బాకీ వసూలుచేసే కాబూలీ లాగున, నన్ను పట్టుకుని ఈ పని అంతా నడిపిస్తున్నాడు.

ఇక చిరంజీవి నళినీకాంతరావు మహాకవి కుమారుడు, తానే మంచికవి, సాహిత్యవేత్త. బాగా చదువుకున్నవాడు - నాయెడ గాఢానురాగం అతనికి. నా మేనల్లుడు వింజమూరి శివరామారావు ప్రెస్సు కాపీలు తయారుచేసి పెట్టగా, తాను సంపాదక బాధ్యతలు పైన వేసుకొని, ప్రూఫులు తానే పట్టిపట్టి చూస్తూ, అవసరమైన మంచి దిద్దుబాట్లు చేస్తూ చెప్పలేనంత శ్రమ పడుతున్నాడు.

ఈ గ్రంథాలకు ముఖచిత్రాలు వేసినవాడు నా కుమారుడు చి॥ బుజ్జాయి అనే సుబ్బరాయశాస్త్రి.

వీడూ, చిరంజీవి నళినీ నూరేళ్ళు హాయిగా వర్ధిల్లాలి.

వీరందరికీ - ఎందరికో - నా యెడ ఈ అకారణమైన
అనురాగం ఎందుకో !
అందరికీ కృతజ్ఞుణ్ణి.

కృష్ణశాస్త్రి

జానకిరాంకి

నీకు ఎంతో ఇష్టమైనవీ,

నీ 'కారు'లో ముందు అద్దం మీద అంటించుకుని ఎప్పుడూ

చదువుకునేవీ,

నేను 'బదరిక'లో వ్రాసినవీ

పద్యాలు ఈ సంపుటిలో ఉన్నాయి

తీసుకో!

# పద్యాను క్రమణిక

# మా అమ్మ

"దులిపి దులిపిన తరుగదు ధూళి ; తుడిచి
తుడిచినా బూజు ప్రాజుట్టు విడదు ; కోణ
కోణమున ఇర్లు మూల్గు ; పురాణ మీ ది
వాణ మెవ రిచ్చిరో యీ అభాజనులకు !

చేరి, ఎగసన ద్రోసి, స్నేహమ్ము వోసి, లే
పేవారు లేరు నట్టింటి దీపికనైన–
అలసతాజంబాల మందు కొందరు స్రుక్కి,
కలహ వాగురుల లోపల అందరును చిక్కి !

పాడరిన వీటిలో నీడలను నీడలై
ఏడువను లేరు బ్రతు కీడువను లేరు–
ఓడిన ఎదల హత్తి, వాడిన ఎలుంగెత్తి,
నాడు విడనాడిపోయిన దేవి కోసమై !

మనసారా ఒకసారి వేడరే" –
అని, లోలోన తలంచినంతనే,

కదలే రెవ్వరో నీను పొంతనే,
శిథిలాలయ గేహళి చెంతనే !

గదిలో మూలల మూలల
పొదివిన చీకట్లు ముదిసి ముదిసి కరడులై
కదిసి హఠాత్తుగ బెదరుచు
చిద్రుపలు చిద్రుపలుగ చెదరి చెడినట్లయ్యెన్ !

పొడుపు బంగరు వెలుం గొడలంత పూసిన
సరణి క్రొంబసుపు పచ్చని మొలాము,
ఆకాశ ఫాల మధ్యాన దిద్దిన క్రొత్త
అరుణ మండలము చెందిరపు బొట్టు,
తొలి ప్రొద్దు పులుగుల కల కూజితములైన
కాలి యందెల కడియాల రవళి,
ప్రత్యూష తుహి నార్ద్ర పారిజాతము వోని
కరుణారస స్విన్న దరహసితము,

కడల ప్రాక, నెనరు పాలకడలి దాల్చి
ఒక్క కేల, అభయముద్ర ఒక్క కేల
అవధరించి, నిశాంతాన అవతరించె
వత్సల మదంబ సౌభాగ్యవతి శుభాంగి !

శిరసెత్తెను శిథిలమ్మయి
కరగే దీపమ్మ, జాలకమ్ముల తలుపుల్
తెరచిన యట్లాయెను, నర
నరాల ప్రవహించె జీవనదులందరకున్!

కవకవలై నవునవ్వుల
దివియలు వెలిగించి రింట, దేవి పదములన్
పువుబంతులుగా శిరసులు
తవిలించి గృహస్థు లనిరి తాత్పర్యమునన్ !

"చిదికినవి, వికృతమైనవి,
ముదిసిన వే నాటి కుంచబో మమ్మ, ఈ
ప్రిదిలిన మానవ గేహము
గదియింతుము సుభగ శుభ జగత్తుగ నింకన్"!

# హాఫిజ్

వేబోక విరియు; నెచ్చెలులార యిను డెగయు !
లజ్జావతి యుషస్సు రజత నీహారాంశు
కాంచలమ్ముల మౌక్తి కాంసమ్ము గప్పికొను !
ప్రాభాత కలధౌత పాత్ర తెండో చెలులు !

హిమ పాండుర మ్మయ్యె సుమలత కపోలమ్ము !
ఉదయవాసిత మయ్యె వసుధాసుధాననము !
అమర సీమాలసానిల వీచికలు వీచు!
త్రావుడా మరల నూతన దినోదయ వేళ!

మరకతాసనముపై కొలువున్నది గులాబి!
పరచి రుజ్జ్వల విపుల శాద్వలంపు తివాసి!
అరుణ మందారమో అనల ప్రవాళమో
మధువు ! సాకీ! మధువు ! మసల దీ తొలి ప్రొద్దు !

ఏల ఈ మధుశాల నేరు మూసినవారు ?
చాలు ! ఈ ప్రొద్దునా సాల మూయగలారు?

హే కవాటవిపాటకా ! కృపాళూ ! వేడు
వార మీ ద్వార మీవే తీయుమీ, నేడు !

అద్భుత మ్మన్యాయ మక్కటా ! మాధ్వీక
మందిర ద్వార బంధన మేల శుభవేళ?
త్రాగుడా యిట నీ గులాబి పొదరింటిలో !
సాగు జీవన జీవనమ్మె యీ యూటలో !

ఈ గారడీ పాత్ర ఇది సికందరు ముకుర,
మిందు ప్రతిబింబిత మ్మౌ విశ్వవలయమ్ము!
ఈ మంత్రి తాక్షులకు ఇది విచిత్రమయమ్ము !
ఇందు గ్రోలగ దొరకు విశ్వవిజ్ఞానమ్ము!

అరుణ సుమవల్లిలో నరుణ మాధ్వీపాన,
మరుణోదయమ్ములో నరుణాధరాస్వదన,
మిట్టి పూవుల నంటి యే మధువ్రత మాను?
ఇట్టి జీవిక లంటి యే చక్రవర్తి మను !

మరల హాఫీజ్ ! మరల మధుపాత్ర మధుపాత్ర!
మరిమరి ప్రియాన నాన్వేష ణోత్సవ యాత్ర !
ఏనాడొ ఏ వింత సీమలోనొ తొలంగు
నీ క్షమాదృఢహస్తములనే సకిమునుంగు !

# గొంతు చీకటి

నాటి యామిని వరువాత తోటలోన
పాటలో మేలుకొన్న స్వప్నములు, మూగె
పాటల పలాశములు, నా గవాక్ష వీథి
నా నయనముల నుండి, నాలోన నిండి !

ఎంత మెత్తని యడుగుల నేగుదెంచి
నావా నాకయి నా కుటీరాజిరమున
“నేను రావచ్చునా” యన్న నీ పిలుపు వి
నంబడదు నాటి యూహాంగణముల జొచ్చి!

పోయె నా కోయిలల కారు, పోయెను నవ
మల్లికల వేళ, శ్రావణ మ్మా శరత్తు ;
మూలమూలల ఈ పర్ణశాల నేడు
హిమపదాంకములే తలలెత్తి పిలుచు!

పల్లకీ

జీవితము మృతిగా, సుప్త శిలగ గుండె,
గొంతు చీకటిగా, పిల్పు కొసరి రాక
"నీవు రావోయి" అని పిల్వనేర కిపుడు,
"నేను రాలే" నటం చేద్మనైన లేను!

# నీలి దారాలు

నీలి నీలి దారాల తారా లతాంత
మాల లల్లును నా ప్రియురాలు రేలు !
పువుపువుగ విడదీసి, మబ్బుల చెరంగు
కొసల ముడి వైచి, యొడి దాచికొను పవళ్ళు !

ఎన్నడును రాని నాకయి యెదురుచూచు
నా సకియ జీవితము సుంత నలగబోదు !
ప్రతినిశా చంచలా చల ల్లాస్యము లయి
పరువులిడు నా మెవ్రేళ్ళ తొందరలు నాకు!

## సంక్రాంతి

"విన నిష్టపడను, వినకు
న్నను తోచదు, విన్నచో మనస్సు వికలమౌ
దినదినము గగన వాణీ
స్వన వీచీ నివహ వాహ వార్తావళులన్!

కొరియా రణ మ్మనుచు, మలయా వ్రణ మ్మనుచు,
కురిసి రణ్వస్త్ర భీకర పరంపర యనుచు,
దరియు సంగ్రామమని, వరదలని, వరపులని,
కరవు కాటకములని, మరణమని, మసనమని !

ఈ లోకమ్ము దరిద్రతా కృపణతా హింసా రిరంసా రుషో
ద్వేలోల్లోలములన్ మునింగి విల యాభీల స్థితిన్ మాయునే
మో - లేకున్న సహోదరాస్థి పలలమ్ముల్ తిందురే
యెందు? త
త్క్రీలా లాసవ పాన లాలస మదాంధీభూతులై మానవుల్!"

అని తలంచి కొనుచు అల్లన శయ్యపై
ఎపుడు తార్చినానొ ఏను మేను -
నిదుర దారులంట కదలుచు కలచుచు
పిలు పొకండు మేలుకొలిపె నన్ను!

ముని వాకిట నిల్చి రేకొసన్
ముసిరే చీకటి నీడ లూర్చుచున్
జరఠచ్ఛదపక్ష్మవిస్రవ
త్తర శాజస్రహిమాశ్రు లొడ్చుచున్ -

తోచె నింబతరువు, తోచెను దూరాన
భోగిమంట చుట్టి మూగు నీడ,
లరుణదారుణాగ్రహాట్టహాసము రేప
ముసిరిపోవు వంతమసక లట్లు!

అంత మెత్తని చేయి నా యంస పాళి
తాకినట్లయ్యె : మరియు మెత్తని రవమ్ము
ఊదిన ట్లయ్యె చెవి పొంత, ఉండి ఉండి
సేతువున దోచు తొలి చైత్రగీతి వోలె!

"ఏమండీ ! ఇంకలెండి! వాకిటికి రానేవచ్చె సంక్రాంతి, ఏ
మేమో ఎన్నడు యోచనల్ తెగవు మీ, కీలాగు కూర్చుందురం

డీ! మానండి దిగుళ్ళు మీ మనసులో! ఈ లోక భారమ్ము మీ
రే మోసేరె? సుకమ్ముగా నడపలే రీ కాస్త సంసారమున్!

ఉండునో ఊడునో మరెపుడో విలయావసరమ్ము నందు బ్ర
హ్మాండము లంచు వేడుకలు మానుదురా ఇపుడెవ్వరేని? ఏ
పండువులో ప్రతిక్షణము పబ్బములో ఇటురావా-ఆసలున్
పండిన కోరికల్ పసిడి స్వప్నములున్ వసివాడిపోవవా?

మన చిన్నసీత లేవనెలేద, గోమయ
హిమవారి కలయంపి యెవ్వ రిడిరి?
కూర్చున్న వప్పుడే కొలువులో గొబ్బిళ్ళు
వన్నె వన్నెల రంగవల్లు లందు!
ఎందుకో తొందర లీ బంతి పువ్వులకు
కొమ్మల రవ్వంత కునుకరాదో?
ఎలమావి లేత యాకుల తోరణాల గు
మ్మాల బుజ్జాయి కాబోలు కూర్చె!

పండు వాయెను-ఎటు లూరకుండు, మాయ
మసక లెరుగని పసికందు మనసు లాయె?
కలలో కోరికలో పూలు కాయ లగుచు
ప్రాకికొనిపోవు ఆ బీరపాదు లట్లు!"

మెడచుట్టి మంచులో తడిసిపోయిన ముద్ద
బంతి కడాని లలంతికలును,
బుజములపై గుత్తముగ నొత్తియుండని
తెలిచీర చెరగుల మిలమిలలును,
పచ్చపచ్చని పైరు పరికిణీ మడతల
సగము కన్పడెడు సెనగ పువ్వులును,
కెంగేల జాళువా గిండిలో బుస బుస
మని పొంగు మైరేయ మాధురులును,

కేతనముపై హసంతిక, శీతవాత
వీచికా సైంధవమ్ములు, వెడలివచ్చె
సుందరమ్ము సేవంతికా స్యందనమ్ము
పైని సంక్రాంతినాటి ప్రాభాత లక్ష్మి!

తలయెత్తి చూతునుగదా దవులందు పారున్
చలికారు ఈదర హుమాయి పయిన్ బయళ్ళన్
వలిపంపు మంచుమును గంచులు తేలిపోగా
చలియించు లోధ్రసుమమేఖల తూలిపోగా!

దవులన్ దోచెను నవమా
ధవ మాగధ గీతు లంత, తరుణి పెదవులన్

మివులన్ బూచిన మంకెన
పువులన్ తొలినాటి పండువులు స్ఫురియించెన్ !

నా యింటి ముంగిటను, నా
ప్రాయపు వాకిట, వలగ్నలగ్న శ్రీ చాం
పేయ మధు పాత్రతో సతి
తీయని సంక్రాంతి లక్ష్మి తెరగున తోచెన్!

"మున్ను హిమవేళ పొద్దోల ఉన్న వగరు
పొగలు, మృగమద వీటికా భుగ భుగలు, ప్రి
యాంగనాలింగనాలు; నే డవసరములు
కుంపటులు దుప్పటులు మాకు కుప్పసములు!"

మసరు సరసా లంత మగువ చెవిలో సుంత
గుస గుసలుగా నెవో కొసరితినా లేదో –
మిస మిసల యెలనగవు లొసపరి పెదవి దాచి
విసరుకొను చిల్లాలు వీటి లోపలి కేగె !

# అయ్యో మనిషీ

తేలు కుడుతుంది - తోడేలు హింసిస్తుంది-
తీతు వెవ్వరైనైన తిడుతుంది!
లోన అంటుడు పురుగు ప్రాణం హరిస్తుంటె-
పైన ఆటంబాంబు పడుతుంది!

ఎందుకీ గతి జగతి కీలాగు పడుతుంది?
ఎందుకు శ్మశానమై చెడుతుంది?

క్షుద్రతిత్తిరి కుటిలవృశ్చిక క్రూరవృక
రుద్రమారణయంత్ర రుగ్మతలు తానైన
మనిషిలోనే పెద్దమడ తుంది!
మనిషికే పెడబుద్ధి పుడుతుంది!

బోదెలో ప్రేమనే పాలు పోయడు కాని
మ్రోడు మందారాలు పెడుతుంది!
అటు చాపి ఇటు చాపి అభయహస్తా లల్లి
జగమంత పందిరిని కడుతుంది!

# ఉమర్ ఖయామ్

**(నాటిక నుండి)**

పరచి గులాబి పూవులు తివాసిగ, పై మధుపాత్ర నుంచి, ద్రా
క్షరసము నించి, దాన నిడి కప్పురపుం బలుకుల్ రవంత, శై
శిరహిమవారి పై జిలికి, చెచ్చెరపా మ్మరుణాసవమ్మునన్
దిరిసెనపూవు మంజరుల నీడల జూచుచు మెల్ల ద్రావెదన్!

వీడని వేడి కౌగిళులు వేసరిపోవని వేళ పోయె, ఏ
జాడల నీని స్వప్నముల చాటున నీడల రెక్కలార్చి; ఈ
నాడు వియోగపుం బ్రతుకు నాశము పోకయె చీకటింటి త
ల్పాడిచి తొంగి తొంగి ఇపుడో అపుడో యని వేచు పిల్చునై!

ఒండు కాచపాత్ర తెం, డంత నింపుండు
దాని వాయిదాక ద్రాక్ష రసము!
దాన వీని దింపి తక్షణమే బిర
డా బిగింపు మో మిటారి సాకి!

వీని పన్నుండ బెట్టుడు; వీని నేల
నంటగట్టుడు, పీపాల వెంట తెరచి
వాయి పోయుడు పచ్చి సారాయి, చెవుల
ముకుపుటమ్ముల చినుకుచినుకులు రాల!

మ్రోయవు చైత్రమాసపదముల్ హరిదంత పదమ్ములందు, శూ
న్యాయత నాంగణాన మిహికాంగముతో చలికారు తొందరల్
సేయును వెంట వెంటబడి చీరగ శైశిరశీర్ణపర్ణహా
తాయతరోదనమ్ములా జరామయ నిశ్వసనస్వనమ్ములో!

అధరసీధు వేదో ఆసవం బేదో యె
రుంగ లేదు గాదె, దొంగ వోలె
ఏల చొచ్చె పానశాల, గులాబీల
పాళ కంటకమ్ము వోలె వీడు?

ఎక్కడనుండి జారె నిట, నెన్నడు సన్నగ జేరె, విన్నుపై
చుక్కలు పాన పాత్ర, నిది చోద్యము, నెచ్చెలి కాడ! త్రావినన్
నక్కునా యేమొ నా కడుపునన్! గళనాళము లోన, అక్కటా,
చిక్కునా? మీకు చిక్కనివి చీకటులే మిగులున్ గుడారునన్

ఆసవమున్ ప్రియాంగన వనాంతరవాసము మా కొసంగి, నీ
కోసము స్వర్గ మున్న దనుకో! పొలిమే రొకసారి దాటినన్

మోసము సుమ్ము; మాకనుల మోసల నున్నదియే నిజమ్ము; పే
రాసలె త్రావి నిల్వగలమా కలకాలము మాదు జీవముల్!

ఒక మధు పాత్ర ఒక్క సఖి యున్న నిషాకు ఖుషీకి, ఈ ప్రపం
చకము సమస్త మేలగల జాణవురా అవురా ఖయామ! నీ
రకముగ "జెంషి"దైన, "బయిరా"మయినా బ్రతుకంత నొక్క పెన్
సుకముల మూటగా సలుప నోచెనె? దుఃఖము లెల్ల త్రోచెనే?

భళిర భళీ ఖయామ! శహబాసుర! – ఎన్నడు దూరె నౌర బు
ల్బులు మధు పాత్ర నుండి పిలుపుల్ వినవచ్చె; అరే అరే గులా
బుల పాద యిందె పూచె నగవుం బువుగుత్తుల! వారె వాహవా!
చెలియయు నిందె దాగె నను చెక్కిట పాటలఫేన మంటగా!

అదిగదిగో గుడారమున కావల ఈ వలయమ్ము మూసి, పెన్
కొదమ ఇరుల్ సమాధికడకున్ నను పిల్చుగదే పదే పదేః
బెదరును సుమ్ము సుంత, పెదవిన్ మధురాసవ పాత్ర యున్నచో
తుదిఘన వొందు సాకి – వినుతున్ దయసేయుము నీ ఖయామ్ముకై!

ఒక్క గులాబి తోట విరియోవరి నీడ మరేరు త్రోవరుల్
త్రొక్కని జాడ లేత చివురుల్ పరపింపుము నాకు సెజ్జగా!
ప్రక్కన ఉంచు ద్రాక్షరస పాత్రిక ఉన్న క్షణమ్ము లింక, కై
పెక్కిన దాక త్రావుచు శయించెద నే తుదికన్ను మూతకై

తలిమమునన్ కవోష్ణ మధు ధారలు పోయుము; నే శయించినం
త లలిత పాటలమ్ములు ననల్ పయిదుప్పటిగాగ కప్పు : క్రే
వల సరి క్రొత్త యత్తరుల వాకలు వాకలు తీర్పు; చెంతనే
నిలుపు మనుంగు నెచ్చెలుల; నిద్దురలో బడిపోదు హాయిగా!

ఏలా వచ్చె హవా హుమాయిపయి వాడే కుచ్చుపాగాల షో
కేలా, పచ్చ జరీబుటా మొఖమ లంగీ దాల్చి చైత్రుండు-కెం
గేలన్ సోగ గులాబికొమ్మ కొరడా కీలించి, సారా నెరా
ప్యాలా సారెకు సారెకున్ పెదవులన్ బట్టించుచున్ నవ్వుచున్!

# విజయవాడ
# గగనవాణి

ఇప్పు డీ కృష్ణయొడ్డున ఈ విజయవాటి
ఇట నొక్క తెన్గుకవి యెలుగెత్తితే –
అటు పంప, ఋషికుల్య యిటు – ఈ నడిమి స్వర్గ
మందు నా ముక్కోటి యనుగు తెనుగులు
విందురా? అందరూను!

పలనాట, వెలనాట, అల పాకనాట, రా
యలనాటి గరువాల జిగులు బిగిసే నాట,
మన కళింగాన, మాయని తెలంగాణాన,
మన తెన్గు చుట్టాలు వినగల్గితే –
ఈ రేయి
ఇట నొక్క తెన్గుకవి యెలుగెత్తితే!

ఏటి పొత్తిట శయించేటి పల్లెల, కొండ
ఘాటీల నిద్రపోయేటి పల్లెల, మావి

తోట దుప్పటి నొత్తిగించు పల్లెల, పైరు
చేల పానుపుల పల్లియల తెన్గువా
ఎందరో - అందరూ వినగల్గితే -
ఇట నొక్క తెన్గుకవి యెలుగెత్తితే!

కుడిచి కూర్చుని రాని కూరుకున పేరుకుని
ఒడలోము సామంతులూ మంత్రులూ గాక,
దారి దూగర బ్రతుకు లీడ్చువా రేడ్చువా
రార నాకట నంగలార్చువా రూర్చువా
ఎందరో - నా గుండె నిలుగట్టుకున్నవా
ఎందరో - అందరూ వినగల్గితే -
ఇట నొక్క తెన్గుకవి యెలుగెత్తితే!

మంచి గతమున కొంచెమేననీ, ఇక మంచి
మంచి వార్తలు కడలినుంచి వచ్చేననీ,
గడియ గడియకు కొత్త జగము లేపుచు, కొత్త
కడిమి చూపుచు, కొత్త కొత్త మానవుడు పెన్
ధూళినుంచీ కుటీ పాళినుంచీ కదలి
నేల నేలల మూల మూలలం దెగసెనని
మన తెన్గునేల ప్రతి మానవుడు వింటేనా!

# స్నేహ క్షీరము

చిననాటి భావవల్లిని పూచినది, వాడ
నిది, వాసనల వీడనిది, ఒకండు
కోరిక - నాల్గుదిక్కుల భూభువనమంత
లవలేశమును వదలకయె తిరిగి,
ప్రతిగేహగేహళి పదమాగి, ప్రతి హృద
యద్వార తోరణ మట్టె త్రోసి,
లోనికి జొచ్చి, నాలోని స్నేహక్షీర
మొక్కింత ఒక్కింత ఒలకబోసి,

"అనుగు సోదర! మరలిరానా" యటంచు
సెల వడిగి సాగిపోయెడు చిరపథికుడ
కావలయునంచు, ఆశ ఆకాశమంత;
పటిమ దీనవిహంగ మిప్పటికి అంతె!

ఘర్మ గంగాఝరీ ధర్మ గోదావరీ
సిక్త సహజీవనాసక్త భారతభూమి

నాకు్కపరి హిమశిఖరి నెక్కి సేతువుదాక
దృక్కు సారించి, పూరించి గళకాహళిక -
విధురప్రియశ్రవోవీథుల మంగళ
స్వాదు వాక్యమ్ముల నూదగలను;
నిలుపగాగలను మాణిక్యదీపావళి
అంధమనోమందిరాంతరముల!

కర్కశహృదయజాంగలముల శీతల
స్నేహదుగ్ధమ్ము వర్షింపగలను;
విరచింపగలను విద్వేషవైతరణికి
అడ్డుగా గాఢసౌహార్దసేతు;
విటనె నిలిచి, సమస్తదిక్తటుల పిలిచి,
సారెసారె జీవత్స్వరస్వృతిని మలచి,
కవిని నేనై పురాణ వైణవికునట్లు
ఊహలున్న, జగమ్మంత స్నేహమున్న!

నిన్న మొన్నదాక మన్నులో మన్నయి
యున్న ప్రాణశంఖ మొత్తినాడు
మానవుండు, గర్వ మాణిక్య కోటీర
ధారి నేడు - విజయహారి నేడు!

పల్లకి

ఈనా డీ భువి బానిసీడు మరి లేనేలేడు! ఒక్కొక్క ఫా
లానన్ పావకనేత్ర మున్నది పగల్ కాల్పంగ - ఒక్కొక్క డెం
దానన్ క్షీరసముద్ర మున్న దవధుల్ దాటంగ - ఈ మానవుం
డే నిర్మాత విధాత నేత మరి తానే భోక్త లోకమ్మునన్!

"స్వస్తి జగత్తున కగు! శ్రీ
రస్తు! సదా శాంతి ర" స్తటంచు వెలయు వి
శ్వస్తుతభారతవాణి సు
మస్తబకము వోలె లోకమస్తకము పయిన్!

# గురుదేవుడు

సామమ్ముల్ ముఖరించు చైత్ర భరతక్ష్మా దీర్ఘహేమంత ని
ద్రాముద్రావశమైన వేళల శుభప్రాభాత శంఖ ప్రబో
ధామోదమ్ముల దిగ్దిగంతముల నాహ్వానించు వైతాళిక
స్తోమమ్మున్ దయసేయు నీ కివె నమస్సుల్ రాజరాజేశ్వరా!

ఈ దివ్యర్షి పదమ్ము భారతమునందే పుట్టి, ఆధ్యాత్మికే
చ్ఛాదారిద్ర్యముచే నశించు ప్రియశిష్యశ్రేయ మాశించి, ఆ
వేదానంతపథమ్ములన్ కదలిరావే! తాల్చికోనిమ్ము నీ
పాదాంభోజ రజోలవమ్ము గురుదేవా మా శిరోవీథులన్!

ఈ జడజీవితమ్ము పలికించితి; వీ యఘపంకమందు నం
భోజము మొల్వజేసితి; వపూర్వము నీ దయ; ఈ నిశీథి నీ
రాజన మెత్తినావు; విపులమ్మగు నీ యెద నిండెనే శర
ద్రాజిత చంద్రకాంతు లమృతమ్ములు స్వర్గలతాంత వాసనల్!

మా చిననాటి చిత్తము లమాయిక కోమలముల్; పదేపదే
పూచిన వాని స్వప్నము లపూర్వము; లిప్పటికేని నాటి ‘సూ

ఫీ’ చరితామృతమ్ము గురిపించెడు మా గురుదేవు డేలకో
తోచు షరాయితో ఫగిడితో నెవరో యొక ఫాదుశాహిగా!

నాయెదలో త్వదీయచరణమ్ముల చిహ్నము లెన్నడేనియున్
మాయవ యే నిశీథపు తమస్సులు మాసిన గాని; జీవయా
త్రాయతవీథి నొక్కఁడ ప్రయాణము చేయుదు నక్షయంపు పా
థేయముగా గ్రహించి గురుదేవముఖస్రుత గీతికాసుధల్

అలనాటి ఋషివాటికలనుండి పరతెంచు
అమ్నాయపూతగంగామృతమ్ము;
అలనాటి బోధివృక్షాయతచ్ఛాయల
సెలలైన బాష్పశీతలజలమ్ము;
అలనాటి కరిమ్రోడు సిలువగద్దియ మీద
నురలిన రక్తకవోష్ణధార;
అలనాటి ఆరబీయుల యెడారులలోన
కారిన విశ్వాసఘర్మవారి;

కలిసి నీలోన లోలోన కదలిపార,
పదనువారిన దయ్యా నీ హృదయసీమ;
తావకపవిత్రజీవితధామమైన
దయ్యా విశ్వవిశాలదేవాలయమ్ము!

ప్రతిఫల మ్మిసుమంత వలవక కర్మముల్
సేయు నీమెయి కురుక్షేత్ర మగును;
ఆశాంతములకు చరాచరమ్ములకును
తరలు నీ యెడద బృందావన మగు;

వివిధధర్మజ్ఞానవేణీసమాశ్లేష
మైన నీ మనసు ప్రయాగ యగును;
పాతాళమును స్వర్గపద మొక్క ముడిలోన
నతుకు నీవే వారణాసి వౌదు;

నీవు కన్పడ నెదురుగా, నిల్చినట్లె
మ్రోలను పురాణభారతపుణ్యమూర్తి;
మాకు దినదినదివ్యయాత్రాకృతోత్స
వానుభూతి నొసంగు బ్రహ్మర్షి వీవె!

'ఏ దురితాంధవహ్నుల దహించకపోవు జడుండ' నంచు ప్ర
హ్లాదుడ వీవె, శ్రీ శుకమహర్షివి నీవె, వచింపబోవ నే
మౌదురొ మమ్ముబోంట్లు? వెరపౌను; ముఖాముఖి నో వినమ్రమూ
ర్తీ దరిసించినాడవు గదే జగదీశుని! ఎంతవాడవో!

# బ్రతుకంత పర్వగా

**ఒ**క నిముసంపు నిద్దురయు నొత్తని నా కనురేకు లెన్నడే
నిక ముకుళింప వేమొ చదలేటి సుమాలయి నిర్నిమేషతా
రకల విధాన, వేసటలు రాని నిరీక్షణ శ్యామికాప్రతో
శికల పదేపదే కలవరించెడు కోరిక జీల్చుచుండెనో!

ఈ శరదిందుమూర్తి హసియింపడు చల్లదనాల జల్లు లా
శాశల, ఆ దరిద్రగగనాంతరసైకతపాళి గూడ జ్యో
త్స్నాశిశిరమ్ము కాదు; కరిచాయల పాయలుపాయలై నిశా
కైశిక మూరకే యిముడకే ముడిలో విడబారు నెల్లెడన్!

రగులు విషాదహాలహలరౌరవకీల హృదంతరాల గా
ల్పగ, నను లోన దాల్పగ భరమ్మొ, వియోగకుటీర మిద్ది నే
టి గతికి రేబవళ్ళు నొకటే పనిగా తపియించు; సోరణం
పు గనుల పల్కరించు నలుమూలల ఏడుచు బారుబారునన్!

రేయికొసన్ పసిండి నునురేకలు ప్రాకకమున్నె పైనమై
పోయెడు మూగ వీవలుల పుంతల నల్లన నేగుదెంచి, నే

నే యెలుగెత్తి నీ నిలయనిస్స్వరణమ్మున నిల్చి పిల్తు 'నా
ప్రేయసి - ప్రేయసీ' యని, చలింపగ యుష్మదుషస్సుషుప్తులే!

నీ యిలు మోసలన్ ముసరు నింబకషాయ పలాశ వాసనల్
మోయగలేని పయ్యెరల మూలుగొ, నిశ్వసనస్వనమ్మొ, యే
మో యని మేలుకోవలవవో సకియా! దరమీలితమ్ములౌ
నీ యెద రేకులన్ బొదువు నీడలు తోడనే మూగిపోవగా!

పిలు పెడబొబ్బ వేసటనొ, వేకువ సోకుటనో, మరేమొ, జీ
రలు వడిపోయెనో, పలుకరాక వెరంగిడె నాకె; తోచె కో
మలకరుణాలసమ్ముగ తమస్సమయాస్తమయాన నేలొ యు
ల్లలితము గద్గదమ్మనగు ప్రత్యుషసీ హిమకంఠరావమై!

పొడరు వెల్గులో, కొరడు వారెడు కోర్కులొ, మోడుటాసలో,
పోడిమి వీడు సౌఖ్యములొ, పోయెను పోయినవేవొ, ఈయకే
జాడలు, నిత్యనూతనవసంతములో యువజీవకాంతులో,
వాడని నందనప్రసవవాటికలో మన కింక నెచ్చెలీ!

ఈ యెద సారెసారె కిసిరింతలు వారును, సీతు సంకెలల్
వ్రాయగ నీ మధూత్సవవిభాతశుభోదయవేళ ప్రేయసిన్
డాయగ, రెక్కలార్చి గగనమ్మునె చేరు, కరంగి పారు లో
తీయని పాటగాగ, కయి తీయని పూవుల తేనె యూటగా!

మునుకొను వేకువన్ మొగిడిపోవు నులూకవిలోకనమ్ము, మా
యని వికచప్రభాతరచిరామరకాంతికి, అప్సరఃస్మితా
ననమధువాసనారుచికి, నా ప్రియురాలికి, అంధకార లో
క నివసనాన మే నిడి నగల్ దొడి చంపిన నూరకుందునా?

ఆపగరాని యీసు హృదయమ్ము దహింపగ, కంఠమెత్తి, ఆ
శాపటలీశ్రవోవితతి జాటితి – "ఔర ప్రభాత శైలసా
నూపలనీలపాళికల నొత్తకయే స్రవియించు నా హిమా
నీపరగాయనీగళ వినిస్రుతమాధురి మంటి కీడ్తురా?"

"ఏ మృగతృష్ణనో వలచి యేడ్చెదు, నీ దురదృష్టజీవిత
ప్రేమము నీ యెడంద కొసరెక్కల కేనియు నందరాని స్వ
ర్గామృతనందనప్రసవ మయ్యెగదా, వెదుకాడబోయె దే
లా మిహికామృషాపథములం" దని రందరు నవ్వులాడుచున్!

ప్రేయసి సోయగమ్మునకు లేదు శరీరము; లేదు మేను నా
తీయని ప్రేమకేని, కలదే యెడబా టిక మాకు! శ్యామ వై
హాయససీమ కార్తికిక యామవతీహసితమ్ము వోలె నన్
బాయ దెదో వెలుంగొ – మధువాసనయో –

# ఏమి మిగిలె

ఊపి ఊపి మనసు నాకొక్కక్క వేదన
కావ్య మౌను, మరియు గాన మౌనుః
నేటిబాధ నన్ను మాటాడగానీని
ప్రళయమట్లు వచ్చి పడియె పైని!

ఒక్కసారి మిత్తియూరుపు నట్టింటి
దీప మార్పినట్లు, సైపలేని
ఊపిరాడనీని ఒంటరితన మేదో
శూన్య మేదో నన్ను చుట్టుకొనియె!

నన్నుగన్న తండ్రి, నాకంటి వెల్గు, నా
యూత, జీవనంపుటూట, బాట,
నా యెడంద యోర్పు, నా యూర్పు, ననువీడి
చన్న – ఏమి మిగిలె నన్న యింక?

పల్లకి

సిలువ గుండెపైని, నెలవంక తలపైని,
మనసులోన ప్రణవమంత్ర దీప్తి;
మతములేని యతని మనుగడే మతమని
కనులులేక మొరకు కనడు గాక!

నా యనుంగు నేల నలుబది కోట్ల గుం
డియల అలల నిండి నేడు పొంగు
నార్తశోకరావ మరిపేద నా గుండె
దారు లొరసి వెలికి పారు నిటుల!

# మహాత్ముడు

మన హిమాలయాలు మన గంగలు పాలాలు
మన స్థలాలు పూలవనులు గనులు
మన అఖండభూతి మనజాతి మననీతి
ఉన్నవరకు గాంధి ఉండి తీరు!

మొదట శిరము నెత్తి పిదప ఛాతీ విప్పి
కంట వెలుగు నిలిపి కంఠ మెత్తి
మానవుం డనంగ మా గాంధియే యంచు
గర్వపడుచు చాటగలను నేను!

నా శిరస్సు శీతనగమంత ఎగ్రదోసి,
నా నరాల జీవనదులు పోసి,
నన్ను మానవునిగ నన్ను భారతునిగా
సలిపినాడు పరువు నిలిపినాడు!

బొరియలోని పురుగు నరునిగా నొనరిచి,
నరుని నన్ను వీరవరుని జేసి,
దేశదేశసభల తెగువతో తేజుతో
నిలిపినాడు వెరగు గొలిపినాడు!

ఒక్క గుండె నేని ఉన్నదా ఆనంద
లేశమేని, గాంధి ఆశ విడడు;
ఒక్కగుండె యేని పొక్కునా వేదన
స్వాంతమందు గాంధి శాంతపడడు!

సగము బట్టలేని సామాన్యుడు ఫకీరు
తాత యొకడు లోకధాత యయ్యె;
ఏ మహత్తు లోన నిమిడించు కొన్నాడొ
ఈ యుగాన చిత్ర మీ జగాన!

ప్రాతఘనత మీదపడి జీవితమ్ము లి
నీడ్చ యేమి? అశ్రు లోడ్చ యేమి?
కదలి చన్న గాంధి గట్టిపునాదిగా
క్రొత్తజాతి కట్టికొందు మింక!

ఒకని కులము, మతము నొక్కని, ఒక్కని
స్వార్థ, మొకని లోభ మావహింప –

తెరలు పొరలు గాగ తీయని చల్లని
నేల నేల బూది పాలు చేయ?

ద్వేష మున్న చోట దేవుండు వెలయడు -
మతులు గతులు తప్ప మతము లేదు -
ఒక్కకంట ప్రేమ, ఒకకంట సత్యమ్ము
వెలుగ, జగతి శాంతి నిలుపవలయు!

ఏను నా మహాత్ము నెంతేని పూజింతు;
అతని పెక్కుగతుల ననుసరింతు;
కాని, అతని కన్న ఘనమైన సత్యమ్ము
తలపు పలుకు పనుల నిలిపియుంతు!

ఎల్ల యెల్లలు కరగగా, ఎల్ల కల్ల
లల్ల నల్లన సురుగగా, ఎల్లజనులు
చల్లని కుటుంబమయి మనజాలు వరకు
మా మహాత్ముడు మా గాంధి మనియె తీరు!

# పల్లకీ

ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు
పల్లకీ అన హృదయమ్ము జల్లు మనియె!
వీడని వియోగమున వేగు మ్రోడు మేను
తలిరు తోరణమై సుమదామ మాయె!

చెదరు చేతుల నెటో కయిసేసు కొంటి
మొయిలువసనమ్ములో ప్రొద్దుపొడుపునగలా!
ఏదో కాలుచు హాయియో ఏదో తేల్చు
భారమో యేదో సైరింప నేర్వనైతి!

కొసరు నడల తూగాడుచు కూరుచుంటి
పూల పల్లకిలో పూలమాల నేను!
‘ఓ’ యనగ ‘ఓహొ హో’ యన బోయవాండ్రు
దారిబడి నిల్చిచూచె ఊరూరు నాడు!

'ఓ' యనగ 'ఓహొ హొహో' యన బోయవాండ్రు
ఛీటి వెలుపల మేల్కొనె తోట తెరువు!
'ఓ' యనగ 'ఓహొ హొహో' యన బోయవాండ్రు
తోట పొలిమేర కాలువ తొణకె నిదుర!

ప్రణయవల్లకి పల్లకీ! ప్రసవభర వ
సంతవల్లిక పల్లకీ! శక్రచాప
వక్రరేఖ పల్లకి! మధు స్వప్నశాఖ
పల్లకీ!

# అశోకము

ఆ చతుశ్శాల నడిమిబయలున నిలుచు
నొక మహీజ మేకాకి వియోగి వోలె;
లోకు లందరు 'నరమావి' మోక యందు;
రిది అశోక మ్మనుచు దీని నేను పిలుతు!

ఏ యనిలు వ్రేళ్ళకో చలియించి కోటి
యాకు లొక తీగగా పాట నాలపింప,
ఆదికాలపు గాథగా నది గ్రహింప
రచటి శాస్త్రులు, నిశితమేధాధికృతులు!

అప్పుడప్పుడు కారాగవాక్షవీథి
నలసగతి నొక్క దక్షిణానిలము వచ్చి
యలముకొనును నా లోపల; పిలుపు విన్న
కరణి పోవుదు నే నశోకమ్ము కడకు.

ఉస్సురని యుస్సురని రసోదిత నిసర్గ
గాన మొనరించు నుజ్జ్వల కరుణ గాథ-
యుగయుగమ్ముల భారత యువ హృదంత
రాళ మొరసిన నెత్తురు చాలు గలది!

నత శిరస్కుడనై నిల్తు', నస్రమజీవ
ముంతు నాపాదపము పాదముల; అశోక
మొక్కపరి తోచు సీతావియోగహృదిగ,
ఒక్కపరి తోచు ప్రాచేతసోచ్ఛ్రుతిగ!

# ఓహో వసంతా !

కవి

రేగు కోర్కెల గుత్తి నా గుండె యటు లెఱ్ఱ
నెఱ్ఱనైనది మావియివురు గుబురు;
మ్రోగు పాటలపేటి నా గళమ్మటు తీయ
తీయనైనది పుల్గుతెరవ గూడు;
ననుచు నూహల డోల నా మనస్సటు పారు
నేరులైనది గాలి యోర యెరక;
ననయు తావులకోవ నా మన్కి యటు సిత
హసితమ్మైనది మల్లెయలరు తీవ;

పొడుపు వాకిలి గవను తల్పులు సడల్చి
కనబడని చేయి యేది విప్పినదో గాని,
నాలుగాశల లోపల మూలమూల
లందు చొరబడి పోయినా డామని దొర!

## పువ్వులు

ఓహెూ వసంతా! ఓయి వసంతా!
ఓహెూ వసంతా! ఓయి వసంతా!
నీహారాంచల నిభృత నిశాంతా!
ఓహెూ వసంతా! ఓయి వసంతా!

## వేణువు

ఈ దారి కెలకునం దేను వేణువ. నోయి!
నాదాలకోవ! ఆనందాల పెనుప్రోవ!
స్వాదు మృదులములు నీ పాదాల సవ్వడులు
ఏ దవ్వు లందైన ఏ నెరుంగగ లేన?
బెదరు నీ పెదవి యూరుపుగాలి కదిలేన-
చెదరు నీ చీర కుచ్చెల సుంత మెదిలేన-
ఆగికో లేనోయి అడగియున్నవి వేలు
మ్రోగిపోయె నోయి ముగ్ధ రహస్యాలు!

## పువ్వులు

ఘుసృణ రసాల కిసాల రసాసవ
కషాయ వికచగళా వసంతా!
మసృణ కుసుమ హృద్గళన్మరంద
స్నపిత చరణయుగళా వసంతా!

ఓహో వసంతా! ఓయి వసంతా!
చిరతర పథికా! ప్రియతమ ప్రేమిక!

## కోయిల

ఈ పర్ణశాలలో ఏను కోయిల నోయి!
నా పున్నె మీ నాటి కేని పండె గదోయి!
ఒక్క కొమ్మ గవాయి- ఒక రెమ్మ సన్నాయి-
దిక్కు దిక్కుల నేడు తోట ఒకటే హోయి!

ఎవరు తగిలించారొ ఈ తీపిలో ఒగరు?
ఎవరు రగిలించారొ ఈ గొంతులో పొగరు?
నా గుండె యెరుపా - నా నాథు పెదవుల యొరపా-
మై గదించిన దెవరు మావి యుగురుకు తొగరు?

## పువ్వులు

మల్లీ వల్లీ మరకత కాంచీ
వేల్లిత తనుమధ్యా వసంతా!
ఫుల్లమాలతీ పులకిత వ్రతతీ
పల్లవ మృదు రథ్యా వసంతా!
ఓహో వసంతా! ఓయి వసంతా!
అరవింద సితకుంద దళస్మిత!

## తుమ్మెద

ఎందేటినోయి స్వామీ, నేను సెలయేటి
అలలలో కదలేటి కలువపూపడవలో
ఊయాల నీ లీల నూగేను తూగేను!
నీ యోలగము వేళనే యింత మరపేల?
తరపి తేనియసోన తొరిపి మంచు జలాన
కురిపించి రెవరు క్రొవ్విరిగుండె లోలోన?
తగిలించి వలపు పుప్పొడి బూది నా మేన
బిగియించి రెవరు మోదుగు పూవు చాపాన?

## పువ్వులు

నీల నీల కజ్జల సమ గరుదం
చల మధుకరచికురా వసంతా!
లోల మనోహర వీచీ విచలిత
బాల మృణాలకరా వసంతా!
ఓహొ వసంతా! ఓయి వసంతా!
శిశిరకుమారా! కుసుమ మనోహర!

## గాలి

దుడుకు రెక్కల జోడు తొడిగించుకున్నాను-
కడిమి పుప్పొడి జీను కదియించుకున్నాను-

పల్లకి

దక్షిణ ప్రాంగణ ద్వాఃకవాటము వీడ
తెరచినావా తోటతెరువు మాధవ దేవ?
కూర్చినారా సుందరీ కోమ లాలస
శ్యామలాలకల నవమల్లికల డోలికల?
పేర్చినారా దారి కురవకాశోకాలు-
ఓర్చుకోనే లేవు స్వామి మృదుచరణాలు!

## పువ్వులు

ప్రతి విభాత హారీకృత రజత
ప్రాలేయాంబుకణా వసంతా!
ప్రతి విభావరీ విరహ హృదయ ని
శ్వసన మలయ పవనా వసంతా!
ఇటు రావే నవమల్లీ!
మాగధి మాలతి శేఫాలీ!
ఇటు రావే కురవకమా!
మాకందా ఓ కింశుకమా!

వసంతుడు

కురియు మంచు నునుజడుల నడగు తెలి
యిసుక నుసుల బయళులపై
తొరయు పుప్పొడుల దొరగు తేనె యస
లొలయు చివురు తెరువులపై

**పువ్వులు**

ఇటు రారే ఇటు రారే!

**వసంతుడు**

చలిత హిమానీ లలిత తుషారము
దులిపి కొనుడు మెయి నంటెనులే!

**పువ్వులు**

మధుర మధుర మధు మైరేయము మా
మరుగు పెదలలో నిండెనులే!

**వసంతుడు**

ఇటు రావే

**పువ్వులు**

నవమల్లీ!

**వసంతుడు**

ఇటు రావే

## పువ్వులు

శేఫాలీ!

## వసంతుడు

ఇటు రావే

## కవి

ఒక జాజి విరితీవ ఓవరియైనది
తూరుపుకోన పూదోట లోన;
రాగల పూర్ణిమా రజనీ ముఖాన, అ
ద్దాన శిరీషతల్పాన నారిగి,
వేబోక యగుదాక విడియుమా యట మేన
తడియైన నునుమంచు జడియు పాన;
వలి వీవలి పిసాళి వలి నలంగి తొరంగి
వెన్నెల వెల్లిలో స్వప్నమైన

క్రొన్నన పరాగ మొక్కింత, కొంత క్రొత్త
బండిగురివింద పూదేనె బాలచూత
రక్త పల్లవ పుటికలో రంగరించి
ఆరగించి వసంత వయస్వి వౌదు!

# స్త్రీ

దరిసె ప్రత్యూష; మొంటరి వీటి వాకిళ్ళ
చిరుపదమ్ముల గురుతు లారయ, ర మ్మొకసారి!
దరహాస పారిజాతము లల్లి, తెమ్మొక్క
మరి భావికాల ఘర్మాంశుమాల కుమారి!

అలన సాగె దినమ్ము; ప్రాయమ్ము మొగసాల
నిలుచు నీ కయి తృషాకుల తరుణ హృదయమ్ము!
కలికీ వలగ్నలగ్న స్వర్ణ లావణ్య
కలశితో కల్యాణకలహంసివలె రమ్ము!

జరిగె ప్రొద్దు; సుదూర మరుగు పదముల సుంత
మరలించి, నడిపింపు విరియోవరుల దారి!
తెరువుపై చలువపందిరి నీడ లమరించి
మరి మరీ సహచరీ మజిలీల నేర్పరచి!

పల్లకీ

సందె వాలెను; ముగిసె సమరమ్ము; పెన్ ధూళి
యందు రాలెను జీవ మడరుచు దయావతీ;
తొందరగ రమ్మ శ్రుతుందిలము భాండమ్ము!
నందికొని, కడుగ గాయముల నెత్తురు చాళ్ళు!

తరిమి మూసినది రాతిరి; ఇంక నా తల్లి
పరిమళ స్నేహ దీప మ్మింట వెలిగింపు!
పరచి నీ యభయాంక పర్యంక, మలసమం
థరరుతిని వాత్సల్య భరగీతి వినిపింపు!

# అనుకోని అతిథి

అడుగలేదు రమ్మని - ఏ యడుగు సవడి వినలేదు;
వడివడిగా సీతుకారువాకిలి గొళ్ళెము తీసి
అడుగిడినది నా విశీర్ణపర్ణశాల మోసాల
ఒక అచ్చర! ఒక వియచ్చర!

అడుగకుండ మంచువలన తడసిన పాదాలతో
నడిచివచ్చె లోనికి, నా క్షుద్రకుటీరాంతరమున
తడబడగా నీడలు, తన వెంట ప్రభాతము తెచ్చి
అంత అచ్చర! ఆ వియచ్చర!

బుజము పైన గదియించిన పుత్తడి గిండియ నిండి
గజిబిజిగా నుండి సగము నిజములైన స్వప్నమ్ముల
బిరబిర నా యొడిలోపల ఒరిగియొరిగి కురిపించెను!
అప్పుడచ్చర! ఆ వియచ్చర!

పల్లకి

నమ్మలేదు తొలుత ; అంత నయనమ్ముల నులిమి విచ్చి
అరసినంత నేల హిమపదాంకములే మిగిలె!
గదిలోపల పారిజాత కుసుమవాసనలు రగిలె!
లేదు అచ్చర! ఏ వియచ్చర!

# తిరునాళ్ళ చేమంతులు

నాకనందన హరిచందనముల కన్న
కరము ప్రియములు చేమంతివిరులు హరికి;
ఆరు కాలాలు తిర్నాళ్ళ కనుచు వేచి,
పూచి యిచ్చును కైంకర్యమునకు వాని!

సురవరానీత కల్పప్రసూనమాల
అడుగులంబడి సొగిలబడి యొదుగును;
చేరు శ్రీవత్సకౌస్తుభశ్రీనివాస
మే మొసంగు చేమంతి కాదామకమ్ము

హారాలై మెడ జుట్టి, అంగదములై అంసాళి పై మెట్టి, లే
తోరాలై చేయి పట్టి యూగు, చన వెంతో గాని శ్రీజానితో
ధారాళమ్ములు; క్షీరసాగరసుతా ధమ్మిల్ల మాల్యమ్ములన్
హేరాళమ్ములు పీఠికాపురవనీ హేమంత చేమంతికల్!

పల్లకి

మెత్తనౌ రేకులన్ పయిం బెట్టుకొనుచు
ఒత్తిలవు కూడ తిరువేను హత్తు ననుచు
పాను పౌత రి, ఉండియు లేని యట్లె
అప్రమత్త సేవాయత్త లైన విరులు!

చెంతన్ క్రేవల నిత్యసూరులు తపశ్శ్రీమంతులున్ వేల్పు సా
మంతుల్ నిల్వ, ప్రపన్ను లెల్లెడల తామై కొల్వ, వేంచేసి, శ్రీ
కుంతీ మాధవు డబ్ధిజారమణితో కొల్వుండు బంగారుచే
మంతుల్ తాపిన పల్లకీపయి ధనుర్మాసాన ఊరేగగా!

## నిగమశర్మ

ఏలాకల్లోలవతీ
వేలావనలోల పవన వీచిక, కేలన్
లాలించిలేపు, ప్రాత
ర్వేళా నిద్రాళువులను ప్రియురాలివలెన్!

చరణాయుధేశ్వరేశ్వర
చరణవ్యాకోచనీరజాత రజశ్రీ
పరిమళ భర మరుదంకుర
గరుదంచల చాలనమున కన్నులు వీడున్!

మోహని ద్రాతిసాం ద్రాంధ్యముద్ర నుండి
ఎట్లు విననైన నైతినో ఇన్ని నాళ్ళు-
ప్రత్యుషస్సుల ఆ మహాప్రభువు తానె,
తానె, తొలి కోడియై ప్రబోధమ్ము సేయ!

పల్లకి

ఒక పాము బుస్సుమని నా
లుక నొక మెరపట్లు పరప, లులిత లులితమై
లుక లుక లాడెద ప్రాణ
మ్మకటా! ఒక కోడి వైతివా నా తండ్రీ!

నీ నిట లోగ్ర పావక కనీనిక క్రక్కు లయాగ్ని కీల ఏ
మైన దయా గయాసుర నిరాసన తీవ్రత కోడి, కోడిరూ
పై...... .......... ............ ........... ....... ......

దూరము దూరమై తొలుత తోచిన గజ్జెల మ్రోత అంతలో
చేరువ చేరువై యెడద చేరును, పారును లోన నేరులై-
శ్రీ రజతాద్రిపై కొలువు చేకొనకే, దయచేసి, చంద్రకో
టీరుడు నా హృదంతర కుటీరము లోపలనే నటింపగా!

హర నట చ్చర ణోపహతి చిట్లి, ఎగయును
మిన్ను వరకు వెండి మన్ను దుమ్ము;
సారెకు చంద్ర కిశోర సుస్మేర తు
షారముల్ కడలంట జారి పడును;
మల మెట్ల ఇరుకెలంకుల నిల్చు ప్రమథ చ
కోరము లర్రులు పార జాచి;
నా నుండి వెలువడి నేను శర్మన్మేష

తూలికవలె తేలుదును బయళ్ళ;
ఎపుడు మునిమాపు కరగెనో, ఎపుడు రజత
నగము సురిగెనో, మ్రోల కన్పడదు బైల;
అఖిల హరిదంతరాళమ్ము నందు నిండి
పండె నా కోసమె అకాల పౌర్ణ మాసి!

మూడు భంగుల గొంతు మ్రోగించు కుక్కుటే
శ్వర దేవ దేవు డుషఃప్రవక్త;
తిరిగి త్రియామా ప్రహరి గాఢనిద్రా భ
రారుణాక్షి మొగుడ్చు భైరవుండు;
బిరబిర దుంఠి కోవెలతోట నీర్వోయు
తుండాగ్రమున స్వర్ణభాండ మెత్తి;
అజిర ధ్వజాగ్రారుణాంశువుల్ గని నంది
గర్వాన సారించు గంగడోలు;
..............................

## ధనుర్దాసు

మోసాలన్ బధిరాంధ భిక్షువులు "రావో ప్రోవవో ఓ కృపా
ళూ సామీ" యని మోరలెత్తి పిలువన్, లోలోన ఏదో భయ
మ్మో సంకోచమొ త్రోసె వెన్క, కపుడే మ్రోసెన్ "ఓహో హోధను
ర్దాసూ! రాగదవయ్య! రా!" యను నుదాత్తాహ్వాన నిక్వాణముల్!

రంగేశయాన గేహ
ప్రాంగణ దేహళిని నిల్చి, పలువయు నోరా
రంగా 'రంగా' యని పిలు
వంగా, వైకుంఠ మొరుగు వాత్సల్యమునన్!

ఒక కను గ్రీష్మ భీష్మ కుతపోగ్రత రార్యమ మండలమ్ము! కా
ర్తిక శిశిరాంశు బింబము గదే యొక నేత్రము; లోకలోక శా
సకుడవు నీవ, నావలచు చల్లని సామివి నీవ, అక్షియు
గ్మక మొకసారిగా విరియగా వెరగా యిక రంగనాయకా!

ఏలా దాచితి విన్ని నాళ్ళు దయలేనే లేదటయ్యా, భవ
ల్లీలాలోల విలోచనాంచల తటిల్లేఖా చలల్లాస్య మే
నాలోకించితినా, శిలా జడిమ పాయం ద్రోయనా రంగదే
వా! లావణ్య పయోనిధీ! వివశ నృత్యం బాడనా కేకినై!

నా తండ్రీ చిరదగ్ధ జాంగలము ప్రాణ మ్మిద్ది-యుష్మత్కృపా
న్వీత స్మిత కటాక్ష వీక్షణము, ప్రావృ ణ్మేఘమాలా గళ
చ్చ్యుత స్రోతము, ఒక్కమారయిన వర్షింపంగదే- ఆరునే
మో తృష్ణాగ్ని! రవంత చల్లబడునేమో జీవమోయీ ప్రభూ!

కన్నులు కల్వ పూలయిన, కజ్జల రేఖ మిళింద బృందమై
న, న్నను చూపు తూపయిన, నాశము మోస మశాంతి గాక యే
మున్న దయా దయావ్యయ పయోనిధి! అంధజగత్తులోపలన్
తెన్నులు తెల్పునో? ఎదుట నిల్పునొ మిన్నులు రంగనాయకా!

కను లని నల్లకలువ లని
అనుకొనుటే కాని, శతసహస్రార్యమదీ
ప్తిని మించి, శతసహస్ర తు
హినకర శీతలత నించునే రంగేశా!

కనగ కనగ నీది కన్నేది మిన్నేది?
అడుగులేవి, కడలి యడుగు లేవి?

ఎరుగనైన లేను; ఏమేను లేని నీ
వీ దృగాళి నెట్టు లిమిడినావు?

వెలికిన్ జూచెదనా, లో
పలికిన్ జూచెదనా, యింక బహిరంతరముల్
వెలుగో ఆనందమొ! ఇది
జలనిధియో చదలొ తెలియజాల రమేశా!

## మల్హణ

"ఏలాగునే మల్హణీ"– "స్వామి ఏమందు"–
"మందుండ" –"మనసంత సందియములె"–
"తుది మొదల్ తెలియ దేదో"– "వింత సందెలో
తెరగాయె" – "ఎరుకంత కరగిపోవు
వెరగాయె"– "మేనంత తెరచిన చూపాయె"–
"చూపంత నిండిన రూప మాయె"–
"నీవా నీవో"– "మల్లెపూవా వెన్నెలప్రోవా
తలపైన" – "అళికాన తిలక మౌనా,

అనల నేత్రమె యౌనా" – "ఆ యరుత పొగడ
పూల చేరొ, కాకోదరమాల సారొ"–
"అరెరె! నా ప్రోల సుందర తరుణ మూర్తి
నీవా మల్హణి! నాతండ్రి! నీవా నీవా!"

ఓపని లజ్జ నీ పదపయోజములన్ పడిపోదు! ఆ పయిన్
నా పయి సుంత వంగి, కరుణా వరుణాలయ, నీవు చేతులన్

జాపెదు; అంత నా బ్రతుకు చల్లబడున్ జలు జల్లులైన సా
రాపగ నీటి సోనల, హిమాంశువు వంక తొలంకు వానలన్!

ఆపగ సోగ పోగ నెటు లౌదల జుట్టితొ, ఎట్లు పెట్టితో
ఆపయి ఓరగా నవసుధాకరరేఖ తురాయిగాగ, నీ
రూపు కనుంగొనన్ మనసులో గొన తొందర లౌనుగాని నీ
దాపున నిల్చి నీ యడుగుదామర చూపులె నిల్పజాలనే?

మదనారీ మృదులాంక పాళి, కుచయుగ్మ స్ఫార శయ్యాళి, మో
హదశా ఘోర నిశాసుషుప్తి వివశంబై పోయె నా శీర్ష మో
మదనారీ! ఒకసారి నీ చరణపద్మమ్మంటగానిమ్ము; నా
బ్రతుకుం డ్రోవల క్రొత్త ప్రొద్దు వెలుగుం బంగారముల్ నిండగా

విను మిదె చేతులెత్తి వినిపించెద - నే నొకతూరి తెల్విమా
లిన జడుడన్, విమూఢుడ, మలీమస హృత్తుడ, ఛిన్నుడన్, శఠుం
డ నగుట యంత్ర కర్మ కలనంబు ఘటింపకు; ఆజవంజవం
బను గహనంబు నింక అభవా చొరజాలను తండ్రి వెండియున్!

# ఆగస్టు 15

కొన్ని తలపు లేవేవో
ఉన్నవి నాలోన నేడు !
స్వాతంత్ర్య వసంత వేళ
స్వాంతములో చివురించినవి!

చిరదాస్య హిమర్తు మృత్యు
శీతలత తొరంగె గాన
క్రొంజివుళ్ళ కెంజిగితో
క్రొత్తవొ ప్రాతవొ కానీ
కొన్ని తలపు లెగయును సన
సన్నగ నాలో!

ఉన్న తలపు లన్నీ పై
కుబికి రావు – ఏ వెరపో

పల్లకి

నాగళమ్ములోన పొంచు
నల్లని చీకటియై!
స్వాతంత్ర్య వసంత వేళ
సాక్షా న్నవ నందనాన

ఒక విషాహి ఫూత్కారము
ఒక వృక వికట విరావము
విన్నట్టులై!

దుష్ట ధవళ భుజంగ దష్టమై మన జాతి
ఒకనాడు పెనుధూళి నొరగిపోయిన వేళ
మ్రోగించె మన మహాత్ముడు నిర్భయ మురళి!
మ్రోగించె మన రవీంద్రుడు తరుణ కాహళి!

శృంఖలము లవనిపై చెదరునప్పటి యులివు
శంఖములు మోరలను చాచునప్పటి మ్రోత
ఒక మహాత్ముని నోట ఒక రవీంద్రుని పాట
సాగి రాగా ఊగి తూగి విన్నాము! విని

వారి వాక్కులు ఖడ్గ ధారగా, విమదాప
గా సుధాధారగా, పారగా పారలగా
"వీరు నిర్గత సకల బంధనులు, నిర్భయులు,
ముక్తు" లని నొసట కేల్మోడ్చి మ్రొక్కితి మపుడు!

ఈనాడు మన నవ స్వాతంత్ర్య వాసంత
నందనములోన స్వచ్ఛంద భారత కవిని!
నిలిచి నిర్నిద్ర గళ నిస్రుత సుధావిరళ
ఝురుల కురిపించి దెస దెసల పరపించలేను!

ఈనాడు నే నేలు నా నాడులో మకుట
ధారినట నేను స్వచ్ఛంద భారత కవిని!
ఏల రాదో వెలికి జాలుగా నాపాట -
క్రొత్త బాటల గొండ్లియాడు వెలుగులయూట!
ఒక మూల్గు ఒక జీర ఒక్క చీకటి చార
ఎటనుండి వచ్చి ఈ యెడద దూరెనో యోర!
నవన వోన్మిషిత స్వతంత్ర భారత భార
తావిరత జనతా జయోత్సవమ్మున నుండి!

ఉన్న సంకెల, కారుకొన్న ద్వేషము, పేరు
కొన్న మోసము, క్రూర హింసారిరంస, మన
మన్ను మిన్నుల నడుమ నున్నయవి నాలోన
సన్న సన్నగ నిండు కొన్న వేమో? కాని

న న్నావహింతురా! ననుగన్న తండ్రి గాం
ధీ దేవుడు రవీంద్ర గురుదేవుడును నేడు -

ఒక్క రక్కసి నేని, ఒక విషాహి ని గాని
ఉండనీ నీ పురా ణోర్విలోపల నేను!

న న్నావహింతురా నను గన్న తండ్రి మో
హనదాసు గాంధి కవిరాజ దేవేంద్రుడును -
ఒక కడుపు పొలిమేర సెకలు రగులగ నీను-
ఒక్క కను కొలికి నొక చుక్క నిలువగ నీను!

న న్నావహింతురా నను గన్న తండ్రి శ్రీ
కర్మచంద్రులు విశ్వభారతీంద్రులు నేడు-
ఎగుడు దిగుడులు లేని సొగసైన వీడుగా
మూడు పదికోట్ల మన నాడు నిర్మింతు!

కవి భట్టుకా, డులూకము కాడు, ప్రాణాగ్ని
యెడలిన శవముకా, డివము కాడు;
ఒకరిని భూషింప డొకరినేన్ ద్వేషింప;
డాతనిగుండె క్షీరాబ్ధియంత;
కవి మన స్సొగయు జంగమవిహంగము, ఉద
యారుణాంశువు లెదురైన జడియు;
డసికొస కవిమన స్సది ఆరయును దొల్చి
యెల్లకల్లల, నెల్ల యెల్ల లొల్చి;

లేదు భయము, నిస్స్పృహ లేదు, లేదు తృప్తి,
శీతలత లేదు, జడతలే, దాత డొరసి
యొరసి తిరుగాడు ప్రతిజీవి నరసి, నివురు
కప్పని తరుణ విస్ఫులింగ మ్మతండు!

అన్న తలపు లేవేవో
ఉన్నవి నాలోన నేడు
స్వాతంత్ర్య వసంతవేళ
స్వాంతమున చిగిర్చి; కాని
ఉన్న తలపు లన్నీ పై
కురలి వచ్చునా?

## ఉగాది

ప్రథమ వత్సరాది యెపుడో
ప్రథమ చైత్రరథము పైని
ప్రథమ వత్సరాదిని గని
వచ్చిన అతిథికి మానవు
డిచ్చె నెట్టు స్వాగతము!

మధురాశా మస్పృణ కిసల
మాలిక లల్లేనా?
మహిత మనోరథ మంగళ
రంగవల్లు లుంచేనా?
దోహలమున ఊహల సుమ
తోరణములు కూర్చేనా?
ప్రథమ చైత్ర రథముపైని
ప్రథమ వత్సరాదిని గని

వచ్చిన అతిథికి మానవు
డిచ్చె నెట్లు స్వాగతము?

మత్తమరు ద్గరుద్వీథి
కొత్త ఉత్తరీయ మెగర
అరుదెంచిన తొలి హాయన
మరసి బ్రతుకు హాయి అనెన?
ప్రథమ వత్సరాది నాటి
నవజీవన పల్లవములు
నవ్యవాసనాలవములు
వేణువులూ వివిధపుష్ప
రేణువులూ తొలియామని
రాణువ గని బ్రతుకంతా
హాయె యనుకొనెనా?

తన గళమే కోయిలగా
తన మనసే ఊయెలగా
మనుగడ ఎర్రని చివురుల
మావి కొమ్మ అనుకొనెనా?
ఇక్షుకాండ మనుకొనెనా?
ఆ యుగాదినాడె మనకి
హాయియె యనుకొనెనా– లేక
మాయయె యనుకొనెనా?

పల్లకి

ఉగ్ర నిదా ఘాగ్రహము
వర్షాకరుణాశ్రుజలము
జడ హిమర్తు నైరాశ్యము
పడి వచ్చేనని తెలియక
ఏ మనుకొనెనో?
వత్సర వత్సర మట్లే
వచ్చినట్లే పోయెనట్లు
అశ్రువుతో హాసముతో
అమృత హాలహలములతో
అంతకంత కతిశయించి
అంసముపై వ్రేగులతో!

కాని, యెట్టి వీరవరుడో
మానవుడు!
మానడు ఆనందోత్సవ
మీ నరుడు!
ఆశలు కళ్ళేలు లేని
గుర్రా లీతనికి!
మన్ను మిన్ను కలియువరకు
తెన్ను వీనికి!

ఊరే కోర్కెలపైని స
వారి చేయుచు
లోకమెల్ల క్రమోన్మిషిత
నాకముగా మారు వరకు!
ఏ యుగాది కా యుగాది
కెప్పటి కప్పుడె యెదురై
ద్వారముకడ చిరునవ్వుల
హారతు లెత్తునా మానవుడు!
కనుక జయా స్వాగతమ్మ!!
మరిమరి స్వాగతమ్మ!
భావియంత బంగారపు
పంట యగును గాక!
రాగల కాలము శాంతికి
తావల మగుగాక!
గుండెలెల్ల కలిపి ఒక్క
దండగాగ కూరిచికొని,
ముందు ముందు ఈ మానవు
లందరు ఉందురు గాక!

కడచన్న యేడు రాగల యే డొకేరూపు
జీవితమధు వింకిపోవు వాని-

కీ యేడు వెనుకటి యేడుకన్నను పాడు
వయ సస్తగిరివైపు వాలువాని-
కేయేటి కాయేడె యేడుపే తొలిప్రొద్దు
శోభ చూడని గూబచూపు వాని-
కీ యేడో ఏ యేడో ఎవరి కేమో తాము
రాకున నీటి బొట్టయిన వాని-
కసలు రానున్న దెప్పటి కపుడు మంచి
సిసలు కా వేపు చెడి ముదిసినవె పోవు-
ఈ నిజము నెంచి నిలబడుం డిచట, ఈ జ
యాంగణాన అనుంగు తెనుంగులార!

# యువగీతం

వుంది కృత మహాయుగం!
ముందున్నది ముందున్నది
ముందున్నది మందే, మరి
మందే యువ మహాయుగం!
కలికాలం, ముసలి ముసలి
చలికాలం మసలి మసలి
కొండ చిలువలాగ, పెద్ద
బండలాగ దొర్లిపోయె!

బరువుల్లో దొరువుల్లో
ఇరుకు ఇరుకు బిలముల్లో-
కునుకుజరఠ కలికాలం-
వెనుక నడకల కుళీరం!

పల్లకి

పీతలాంటి భూతం మన
తాతల్ది తండ్రుల్ది!
రోత రోత రోత – మంది
ప్రాత ర్వియదావాసం!

ప్రాత రుజ్జ్వ లాకాశం!
భావి మంది రావాసం!
స్ఫీత జీవ ధౌత నాక
నేతలం విధాతలం!
స్ఫీత చలత్ ధౌత లసత్
చేతనులం నూతనులం!

మన కే మిక? మన కే మిక?
మంది కృత మహోయుగం!

# రేడియో

ఔరా! మాటకు రెక్క లున్న వట; నే డా మాట ఇప్పాట ఎ
ట్లారోహించి మహావిహాయసము, నెట్లందున్ – ఒకేసారి కా
వేరీ దేవ గృహాంగణ ధ్వజ శిరోవీథీ మరుద్వీచి, కా
శ్మీ రారామ మనోజ్ఞ కుంకుమరజ స్స్ని గ్ధాని లోర్మిచ్ఛటన్!

## జీవన శంఖం

అలసి పోతుంది గాలి ఒక్కొక్కప్పుడు!
వెలుగు చచ్చిపోతుంది ఒక్కొక్కప్పుడు!
స్వాధీనం తప్పిపోయి
ప్రాణశంఖాన్ని పాపం-
ధూళిలో జారవిడుస్తుంది
దుర్బల హస్తం-అప్పుడు!

నిదురించే నిశీథి నపుడు నిష్ఠురంగా
తట్టి లేపుతుంది తటిత్కశాఘాతం!
నీరసపడిన హృదయాన్ని ఊపి ఊపి
నిలబెడుతుంది నవతారుణ్యమంత్రం!
ఒక్కసారి ఏయదృశ్యశక్తి
ఊపిరి ఒత్తిడికో
గొంతు సవరిస్తుంది మేలు
కొంటున్న జీవనశంఖం!

దూరగగన ఫాలాన శుక్రతార పొడుస్తుంది!
చేరి ప్రభాత పదధ్వని చెవిలో పడుతుంది!

పేరు పేరునా ఒక్కొక్కరినే
మారు పలికే దాకా
ఊరుకోక పిలుస్తుంది
ఉదయారుణ శంఖం!
ఉండి ఉండి ఉద్రిక్తమై
వీరోజ్జ్వల శంఖం!

"మన కింక నిద్రలేదు-వీల్లేదు!
మన కింక ఇల్లు లేదు- అక్కర్లేదు!
అనుకున్న కడపల అందుకునే దాకా
అనల వర్షం కింద మనం నడవాలి!
తప్పదు!"
ఒక్క పెట్టున మృత్యువుకన్నా
ఉగ్రంగా-చనవుగా-
ఉరుముతుంది రుద్రశంఖం!
ఉన్మత్త విలయ శంఖం!
ఒళ్ళు విరిచి లేస్తుంది గాలి!
కళ్ళు తెరిచి చూస్తుంది వెలుగు!
వల్లమాలిన ఆవేశంతో

పల్లకి

అందుకొంటాడు మానవుడు
మట్టిలో మరిచిపోయిన
మహావీర శంఖం!
ఉల్లాసంగా ఒత్తుతాడు
విజయోత్సవ శంఖం
చల్లగా పూరిస్తాడు
శాంతమంగళ శంఖం

# చరణ సన్నిధిని

ఒకప్రాయమందు వీటికి తలుపు లుండవు;
తెరచియుండును నవాతిథి యేరి కోసమో!
ఆనాడు ఒక సురభిళానిలము వచ్చి, నా
లోన నింపినది నవరసధాని నీ వాణి!

అపుడు నా గొంతు రవ్వంత కోయిల గాన-
అపుడు నా మనసు ఆవంత ఊయెల గాన-
అపుడు నా మనికి తరుణామ్రశాఖిక గాన-
ఆలపించితిని అల్పాల్పగీతులు కొన్ని!

అప్పుడే ఒక మంగళానిలము కొని తెచ్చి
అందిచ్చిపోయె అజరామరము నీ వాణి!
నా గీతి అప్పుడే నగలన్ని విడనాడి
శిరసు వంచెను ధూళివరకు నీ పద మాని!

పల్లవి

వందన మయ్యా అభినవసుందర
కవితారాజ్య ధురంధరా!
రసిక మనోమందిర! కవి పురందర

# నవ్యశక్తి

స్వార్థమ్ము కల్పాంతసమయాంధ్యమైన,
దారుణ రుషోద్ధరణ మారణమ్మైన,
ఏ యుద గ్రాగ్రహ
మ్మే యుదాత్తావేశ
మావహించిన పురుగు నరుడై-
ఆవరించిన నరు డమరుడై

జరఠ జగతీ భువన నరక భవనమున నవ
మంగళయుగ స్వర్ణమండల శ్రీరుచుల్
నిండించు
సమసౌఖ్యము సమృద్ధి
పండించు,

ఆ శక్తి
ఆ నేత్రి
ఆ నిత్య శుభదాత్రి
శాసించు మమ్ము-ఆశాసించు నహరహమ్ము!

# తుషారాద్రి నిద్ర

తాను కల్పమ్ములును లేవనైన లేవ,
డొక యుదయమ్మైన నాడు మేలుకొని నాడు;
అది మహానిద్రయో- తుషారాద్రి చూడ
చిత్తగింపక కనులు మూసికొని నాడు!

సడలి సడలని వలిరెప్ప సందులంట
నెట్లొ కనినాడు, కనుబొమ లెత్తినాడు;
నాటి మానవులను పేద కీటకమ్ము
లూరకే పెన్గులాడుచున్నారు క్రింద!

అంత తన గుండె యెగయ దిగంత మంట
ఉస్సురని యొక్కసారి నిట్టూర్చినాడు;
కులకులని రెండు కన్నుల నొలుకు నశ్రు
ఝరుల చెక్కిళ్ళు చారలు చారలయ్యె!

అంతలో మున్గిపోయినా డపుడె మరల
అద్రిరాజు హేమంతయుగాంత నిద్ర!
హెూరుమని ఆర్చినవి సప్తమారుతములు;
హెూరుమని లేచినవి సప్త వారినిధులు;
ప్రళయ మిది ప్రళయ మ్మని వడకి యొదిగి
కను మొగిడ్చ రీరేడులోకాలవారు!

# అప్పుడు గాని అరుణోదయం కాదు

వస పెడుతుంది ఈ రాత్రి!
సలుపుతుంది కురుపులాగ

ఒక్కొక్కటె ఒక్కొక్కటె
చుక్క చుక్క చినుకు పడి,
కుళ్ళి కుళ్ళి పిసినారి లాగ-
కుమిలి కుమిలి పిరికిపందలాగ.
గొంతు పిసుకుకొని
గొప్పయింటి విధవలాగ-
ఏడుస్తుంది ఈ రాత్రి!

చూడలేక మొగం తిప్పేసుకుంటున్నాయి
చుక్కలు!
చప్పున తప్పుకుంటున్నాయి
గాలులు!

వెక్కి వెక్కి యేడవలేదు
దిక్కుమాలిన రాత్రి!
పిసినారి రాత్రి-పిరికిపంద రాత్రి!

గొల్లు గొల్లుమని జల్లుజల్లులుగా
వెళ్ళబోసుకోవాలి శ్రావణ మేఘంలాగ!
బారుబారుమని పారజాచుకొని చేతులు
హోరు హోరు మనాలి పడమటి గాలిలాగ!

బాగా ఏడు రాత్రీ!
భయం లేదు- బిగ్గరగా ఏడు రాత్రీ!
గోలపెట్టు రాత్రీ! గుండె బాదుకో రాత్రీ!
వెళ్ళిపోయేలోగా వెక్కి వెక్కి యేడు!
అప్పుడు గాని అరుణోదయం కాదు!

# మబ్బా మలా

గిరిపయి వాలిన మేఘం
జరిగిందా–జరిగిందా!
జరగలేక బరువుకి అటె
ఒరిగిందా– ఒరిగిందా!

కురిసి కురిసి వానజల్లు
తరిగిందా– తరిగిందా!
కరగని శిల జూచి మనసు
విరిగిందా–విరిగిందా!

వెలవెలనై మబ్బు దవుల
కరిగిందా–అరిగిందా!
మల చెక్కిటట నీటి చార
చెరిగిందా–మిగిలిందా!

# హాలికుడు

వేల శతాబ్దుల వ్రేగులవల్ల
వంగిపోయి,
విశేష భూమీ భారం క్రింద
క్రుంగిపోయి,
అణగిపోయి,
అణగిపోయి,
అహరహమూ నేలవైపే
అదే పనిగా చూస్తూంటాడు!

నాగలిపైన బరువుగా ఒరిగో,
గొడ్డలి బుజాన వేసుకునో
నిలబడతాడు!

యుగయుగాల శూన్యమేదో, వాని
మొగంలో స్ఫురిస్తుంది!

ఆనందమూ నిస్పృహా అన్నవి
అసలేమీ యెరగని జడుడు!
ఏడవ లేడు; కన్నీ రోడవ లేడు.
ఆశపడలేడు; ఆహ్లాదపడలేడు.
కొయ్య, రాయి, ఎద్దు-
వీటికి తోబుట్టువు వాడు.

వాని ఫాలం అంత అర్థరహితమయ్యేటట్టు
వేని చేయి తుడిచివేసింది?
వాని మనస్సులో వెలుగు
వేని యూర్పు ఆర్పింది?

వానికి చేతకాదు చుక్కలవైపు
చూపుల్ని పరపించడం!
అమృతగానంలో ఆరోహణావరోహణాలు
వానికి అపరిచితాలు!
ఉషఃకాంతిరేఖ, సంధ్యాసమయారుణిమ,
ఏమీ పట్టించుకోడు వాడు.

బాధామయశతాబ్దులు వాని
భయదమూర్తిలో తొంగి చూస్తాయి.
వంగిన వాని బుజంలో

కాలపురుషుడు రచించిన దుఃఖాంతనాటకం
కనబడుతుంది.
వానిని మనం దగా చేసినట్లు, దోచుకున్నట్లు,
మలినపరిచినట్లు,
వాని వారసత్వం పోగొట్టినట్లు
అనిపిస్తుంది నాకు!

అయ్యా! అధికారులూ ప్రభువులూ
సామంతులూ శ్రీమంతులూ
ఆ భగవంతుని కిదా మన మర్పించుకునే ఉపద?
ఆ వంగిన నడుమును ఎలాగున సరిజేస్తారు మీరు?
ఆ క్రుంగిన బుజం ఎలాగున నిలబెడతారు మీరు?
వేరు నేర్పుతారు వానికి వెలుగుకోసం పైకి చూడడం?

(ఇది ఒక ఆంగ్ల పద్యం - "The Man with the Hoe" by Edwin Markham - సారాంశం)

## భావకవి

అసలు శ్రావణమాస మధ్యమ్మునందు
కురిసి తీరాలి వర్షాలు; కొంచెె కొంచెె
మేని రాలాలి తుంపర లేని; కాని
ఉక్కమాత్ర మేమాత్రమూ ఉండరాదు!

ఇపుడు నా వొళ్ళు కొంత లావెక్కె, సుంత
కదిలితే చెమట జడులు క్రక్కుతుంది;
నేనె వర్షపు మేఘమ్మె తేను పైన
ఒట్టిపోయింది కొండపై ఉత్తమబ్బు!

ఓసి నీ యిల్లు బంగారమో మరేమొ
కనబడ వదేమి పడమటి గాలి? మాకు
అవసరములేని చలివేళలందె యెగసి
యెగసి పడతావు మా మీద ఏడిపించి!

ఆంధ్రసాహిత్య పరిష దధ్యక్షు నడుగు
తేను నీ మాట, వెంటనే యిట్లు చెప్పె-
"అలసి సొలసి వాలెను వరుణావరోధ
భామినీ గండ కర్పూర పాళులందు!"

నాకు మాత్ర మా భావము నచ్చలేదు-
భావకవిని కాబట్టి, "ప్రియావియోగ
నిబిడ నిశ్వాసములు రేగి నేడు ముసర,
వందరూ గుండెలేని వారగుటచేత!"

వారికీ మాకు ఉన్న దావంత తేడ!
లేని మేనకతో వారు ప్రేమలేని
ఉపరతుల మున్గిపోతారు; ఉన్న చెలియ
సోయగము మాకు ఊర్వశి తీయదనము!"

అపుడు మబ్బంటె చాలు, అనార్తవంపు
నర్తనము చేసె పురివిచ్చి నా యెడంద;
ఇంక శ్రావణ మేఘ మంటేన, గుండె
నీలగగనమ్ము, గాలియుయ్యాల రెక్క-!

నేను కళ్ళెత్తి కాస్త చూశానొ, అపుడు
నాకు కనబడుతుండేవి ఆకసమున

ప్రేయసీ మేఘమేఖలయో, ఎదురుగ
ఊర్వశీకై శికీచ్ఛాయయో కదలుచు!

అప్పుడప్పుడు ఆరోజులందె కొన్ని
కొన్ని రాత్రుళ్ళు, పాకుతూ, కుములుతూ, వ
గర్చుతూ, మూల్గుతూ మింట కనబడేవి
చెలియనిట్టూర్పు నల్లపాగల గుబుర్లు!

ఎప్పుడో ఎప్పుడో పైకి ఎగిరి, ఎగిరి,
నేను ఋషినై, పొడుపుకొండ సాను వెక్కి,
తూర్పు వాకిటి కేసి చూస్తూంటె కాస్త
తేలుతూండేవి పీతాంబరాల కొసలు!

ఇపుడు మారింది బ్రతుకు; మునుపటి గొప్ప
రోజులన్నీ గతించాయి; బూజుపట్టి
బూజుపట్టి రాయై చచ్చిపోయినాను-
నన్ను* చెరసాలలో పెట్టినారు లెండి!

ఇంత పెద్ద ఖైదుకు గూడ ఇంత గుడ్డి
కన్నులాంటిది కిటికి; రెక్కలను ముడిచి

* ఉద్యోగం చేసిన కాలేజీ

కూడ చొరలేదు చిరుగాలి; మోడు నార
సొలలో గిలగిలలాడి సాగు వెలుగు!

ఒక మొయిలు మేకపిల్ల! వేరొకటి ముసలి,
మరి యొకటి ముసుగిడ్డ బ్రాహ్మణ వితంతు,
వొకటి తెరచాప గుండె విప్పుకొను పడవ,
ఒకటి వెన్న, యొకటి దూది, యొకటి నురుగు!

కారుమబ్బులబారు సవారి చేయు
సాదులో, సామజసమాజమో, దిగంత
ములకు విడబారి సాంబ్రాణి పొగల పాయ
పాయ సందుల నుమియు నప్సరల కురులొ!

ప్రతిపదార్థమ్ములోని రూపమ్ము వరకు
అసలు తత్వమ్ము కొరకు ప్రయాణమౌ మ
నస్సునకు అడ్డుకంచె లన్నవియె లేవు!
ఇపుడు మేఘము మేఘమే; అపుడు కాదు!

## రాజా రామమోహనరాయ్

తౌరాధ్వమ్ముల దాటి స్వర్గపదముల్ తాకంగ శీర్షమ్ము, నీ
హోరాహోర్యము పోలె తోచెదు, మహాత్మా, దూరదూరాల, మా
కై రాగామృత వాహినుల్ పారలిరాగా, తావకోదారవి
స్ఫారస్వాంతము నిండి పూర్ణయమునా భాగీరథీ సింధువుల్

## సుప్రియ : బుద్ధభగవానుడు

శ్రావణములు మూడు చనెగాని చినుకేని
లేక, నేల గుండెదాక వ్రీలె!
కరవు వచ్చి ఊరుదరి మావితోపులో
ఆకులట్లు ప్రాణులట్టె రాలె.

కలవారు కాస్త నిలిచిరి
అలము నిరుల గ్రుడ్డి దివ్వెలట్లు; ముసుగులో
పలి నీళ్లు రోగి మూల్గుల
వలె, వడకుచు, మిత్తినోటి వాకిటి మొగలో

వార్త విన్న దయావార్ధి వచ్చి విడిసె
తపసి ఆ తోటలో మృద్వితర్దికపయి;
వానిరాక నెరిగి ఊరివారు వచ్చి
మూగి రచ్చోట వ్రేదుల ప్రోదులట్లు.

చిరునవు మీగడల్ మిసిమిజిడ్డుల నొడ్డుల చిందగా, శర
త్సరసులు సంయమి ప్రభువు చల్లని కన్నులు మున్ను; క్రేవలన్
దొరసిన తావులన్ తడుప నోపున; విప్పు డదేలొకో క్షమం
దొరగును, పిల్చునెవ్వనినొ తొందర తొందరగా చలించుచున్!

స్వామిని చూడలేక తలవాల్చిరి పౌరులు; వారి నారయం
డా ముని; చెంత శిష్యుపయి నల్లన చూపిడె; ఆత డా దయా
ధాముని చిత్తముం దెలిసి, తత్సభ గన్గొని, " ఈ జనమ్ములో
క్షామము నెవ్వరేన్ తరుమ జాలుదురా" యని హెచ్చరించినన్!

"ఇన్ని నాళ్ళనుండి ఎగబెట్టినది వాన;
ఎన్ని యేళ్ళ కరవొ యెవడెరుంగు?"
అని తలంచికొనుచు అట నొక్కడేని వా
కదపబోడు; చూపు మెదపబోడు.

"ఉన్న మేటి కొటారు లూడిచి యిచ్చినన్
తిందురో రత్న మాణిక్యములను"
"విధుర కేదారంపు బీడులబడి యిచ్చ
వచ్చినంత మెసవవచ్చు మన్ను"
"కరగింపనౌ మేనికండలు, ఏలాగు
పిలిచి పిండుదు లేనిజలదములను"

"ఆనదు విశ్వరహస్యమ్ము దాక చూ
పెండవానలరాక లెరిగి చెప్ప"

అని గొణిగికొంచు లోన మాటాడ్రైరెరి
ధనపతి ధరాధిపతి బాహుదర్పశాలి
విపుల విద్యాధరుడు స్వార్థవికలులును కృ
పాదరిద్రులు నగుచు నిర్భాగ్యు లెవరు?

అంతలోన ఎవరో సభయంచుల నిలిచినయట్లె
పిలుపేదో నిశ్శబ్దపు జలనిధి కలచినయట్లె
అందరు నటు గనిరి; శైశిరాగ్రమశాఖపైని తొలి వ
న ప్రియారవ మ్మనుకొని, "సుప్రియ! సుప్రియ!" యనిరి.

ఎండురెమ్మమేను; రెండుమూ డాకులు
పీలికలును; చిన్ని కేల జోలె;
బాల తోచె జీర్ణపర్ణకుటీరాన
దీపశిఖవిధాన దీనయయ్యు

"దేవర కటాక్ష మున్న ఈ దీనబాల
కరవు పోద్రోలు; అందర కలిమి నాది;
ఎవరికల్మి వారిదె యన్న అవధి కలదు;
కరుణ కావలి ఈవలి గట్టు లేదు.

"ఎన్నడో త్వత్కృపారసస్విన్న నేత్ర
విగళి తాశ్రుల నిందు నింపితిరి రెండు;
బాగ్య మీ జోలె; అక్షయభాండ మిదియె
స్వామి యడుగులకడ" నంచు పలికె నామె.

వాన కురిసిదోల, వారికణాల హృ
దంతరాల దాచి, అల్ల వీచి,
మేను నిమురు శుభసమీరణాంగుళివోలె
చిన్ని యెలుగు తపసి చెవుల సోకె.

మరల కరగె మౌని కనులు కరుణాకాసారముల-
తెరలి ఉరికె రెండశ్రులు మృదుకపోల తీరముల;
ఒక్క మెరుము ఒక్క ఉరుము చిక్కని దాక మేఘమాల
దిక్కుదిక్కులంట జడులు తెరలు తెరలు వాన గురిసె!

ప్రభువు మనసు కరగి, ప్రభువు కన్నులు స్విన్న
మైన వేళ మనకు వానకారు;
స్వార్థతప్తమైన జాంగలమున అప్డె
గంగ యమున కలిసి కదలి పారు.

## మాట–మౌనము

మౌనము (స్త్రీ) : నిదుర నేను నీడ నేను
నిశ్శబ్దము నేను!
జపము నేను తపము నేను
జల నిధి లోతును నేను!

పెదవి విడని ఆవేశపు నీలిమను
కదలని గిరికందరముల ఏకాంతమును!

రేలు ముసురుకొను వేళ
గాలులు దాగిన వేళ
తరుశాఖలలో వసింతు!
తరుల క్రింద విశ్రమింతు!

అడుగు సడుల ఆలకించు బాటను నేను
పులుగు నుడుల దాచుకొన్న గూటిని నేను!

**మాట (పురుషుడు) :** నీవు రాత్రివి మౌన ధాత్రివి
ఒక్కపరి నా ప్రాణదాత్రివి!
నీవు రాత్రివి మౌనధాత్రివి
ఒక్కపరి నా హృదయనేత్రివి!

నీ యెడద పాల్కడలి మరిగి
మరిగి తెరలు నురుగును నేను!
నీ కటకకింకిణుల తొరగి- నేను గలగలను
నీ చెరగు అంచులను విరిగి-నేను
మిలమిలను!

నీక్షమా గర్భమ్మునుండి-నేను కృషినై
నీ నిశాంతాంగణమునుండి-నే పగటినై
నీ కెలన నుందు - నీవు నను విందు
ఓ సనాతన! నిత్యనూతన!

తామసి మౌనమ్మైన - తారక మాట!
తీవియ మౌనమ్మైన - పూవే మాట!
పాలతుక మౌనమ్మైన - పురుషుడు మాట!
ఓరిమి మౌనమ్మైన - కూరిమి మాట!

# బ్రహ్మర్షి మాట

శ్రీమదోంకారనాద హృత్సీమనుండి
అవిరతానంద జీవితోత్సవము దీని
నా మహానందనాథుడే అలరజేసె
ననుచు నమృతాలయూట బ్రహ్మర్షిమాట.

బ్రతుకు, చావు, కూడిక, యెడబాటు, మిన్ను,
మన్ను, మున్నీ రతని ఆట; మలయు సృష్టి
దాననే, దాననే సృష్టి స్థైర్య మూను
ననుచు రతనాల పేట బ్రహ్మర్షిమాట.

అతని ఆనందహాస లేశాంకురములు
ననలు పొనలును, ప్రతిరణన్మంజుకుంజ
మతని ఆనందగాన రసార్ద్ర పుంజ
మనుచు క్రొందేనెతేట బ్రహ్మర్షిమాట.

పగలు రేయి ఆమనియు వేసఁగియు సీతు
కారు శిశిరమ్ము నెదురయి దూరగమయి
తిరిగి తిరిగి విధవిధాల తరలి వచ్చు
నతని ఆనంద మనుచు బ్రహ్మర్షి మాట.

ఎల్లి విచ్చేయుటకె మెలమెల్ల జాగు
నతని ఆనందమగు దినాంతారుణాభ;
అతని పునరాగతానందగతుల తెల్పు
ప్రత్యుషశ్శోభ యనుచు బ్రహ్మర్షిమాట.

ఒక్క కనురెప్పపాటేని ఊరకొనక,
ఒక్క నలుసంతయును పునరుక్తికన క,
అంతకంతకు వృద్ధియో, నంతకంత
కందమో, సృష్టియంచు బ్రహ్మర్షిమాట.

ఆ మహానంద కాంతిగర్భాంతరాళ
మందు సముదయ మందుచు నవతరించు
నవనవమయూఖరేఖ మానవుఁడటంచు
నలరు తేనియతేట బ్రహ్మర్షిమాట.

మానవుడు రక్త మజ్జాస్థిమాంస రచిత
విగ్రహమె కాదు; భావించి వివిధగతుల

అనుభవించి, నిశ్చయించి, ఆచరించు
యంత్రమేకా దటంచు బ్రహ్మర్షిమాట.

ఆది నొక్క చిన్మూర్తిగా నవతరించి
అల నలన సత్యరూపత నతిశయించి
పూర్ణ వైభవమూర్తి సంపూర్తినందు
నతఁడు మానవుడనుచు బ్రహ్మర్షిమాట.

సాగిపోయిన వేలకల్పాల కర్మ
ఫల మహాభాగ్యరాశికి వారసుండు
రాగల యుగాల శిల్ప నిర్మాతయైన
యతడు మానవుడనుచు బ్రహ్మర్షిమాట.

కారు చీకటిలో బైలుదేరి, అమృత
కాంతి కోరి, సతమ్ము లోకమ్ములో ప్ర
యాణమగు బాటసారి యీ మానవాత్మ
అనుచు నమృతాలతేట బ్రహ్మర్షిమాట.

ఎన్ని సుఖదుఃఖగాథలో హృదయఫలక
మందు చిత్రించుకొన్నాడు మానవుండు
అన్నిటికి పైని "అతడు నా యనుగు తండ్రి"
అనుటయే మత మంచు బ్రహ్మర్షిమాట.

వాడి పోవక యెప్పుడు వలచు తావి
వెగటు కాబోక యెప్పుడు రగులు తీపి
మూగ వోవక యెప్పుడు మ్రోగు పాట
మతమె యని తేనెతేట బ్రహ్మర్షిమాట

తుది మొదలు సర్వ మతని కన్నెదుట నిలుచు;
అతని యేర్పాటులో నెన్నడైన నెటనొ
మంచిగా చెడ్డ, మధువుగా మంచుకారు
మారితీరు నటంచు బ్రహర్షిమాట

సత్యరతి, ధర్మగతి, గృహస్థవిధి, అతిథి
అర్చన, స్వదేశ సేవన, మఖిలమాన
వానురక్తి, యీశ్వరభక్తి యని వధూవ
ర్వార్థ సప్తపది యనుచు బ్రహ్మర్షిమాట.

ఒక్క చిరుగీతి విరిసిన, నొక్కయాస
జోతి మెరసిన, నొకమంచి చేత కొక్క
పూత సంకల్ప మొలసిన, మ్రోల నిలుచు
నను గు చెలి వీవె యనుచు బ్రహ్మర్షి మాట.

ప్రార్థనము లౌకికారణ్య పదములందు
పథములం దీర్చు దీపము; బ్రతుకులోని

విడని వ్యూహమ్ము విప్పి తప్పించు మంత్ర
మనుచు రతనాల పేట బ్రహ్మర్షి మాట.

రాజ పథము స్వర్గమునకు, రాజరాజు
నగరు మొగసాల తాళమ్ము, పగలు రేయి
పరమధామమ్ము చేరగ నుత్తరువు మనకు
ప్రార్థనమ్మె యటంచు బ్రహ్మర్షిమాట.

బాల్యమున దాది, పరువాన ప్రాణసఖుడు,
కష్టమున తోడునీడ, రోగమున మందు,
ప్రార్థన మ్మార్తి యందు నూరట యటంచు
నమరపదవికి బాట బ్రహ్మర్షిమాట.

శాంతి సుమముల నాశాలతాంతములను
అందికొని వచ్చి మరణశయ్యాతలమున
పరచు ప్రియదివ్యతమదూత ప్రార్థనమ్మె
అనుచు నమృతాలయూట బ్రహ్మర్షిమాట.

సడలు మేనికి ప్రీవలి, బడలు నెదకు
తీయనగు నుడి, వడలు పూదీవ కమృత
జీవ మిడు వానజడి, దీనపావను డత
డమరు నను నాస యనుచు బ్రహ్మర్షిమాట.

తమ కలిమినుండి యిత్తు రందరు నతండు
తన్ను దానే యొసంగు; నందర దొరంగు
మందరును నిన్ను పాయుదు, రతని వీడు
మతడు వెన్నాడు ననుచు బ్రహ్మర్షిమాట.

ఏ మహాసాహసి దరిద్రు డీత డనుచు
నను పిలుచు; ప్రేమ నేత్రము నాది; నాకు
పదపదమ్మున పువుపువు ప్రణయలేఖ
అనుచు ఆమనితోట బ్రహ్మర్షిమాట.

నేను తట్టగ తెరచును తాను, రోయ
నేను తా తోచు, నే కోర తా నొసంగు
నతని యేర్పాటు నాయభిమతము నొకటె
అనుచు క్రొందేనె తేట బ్రహ్మర్షిమాట.

ఎల్ల తెరలు తొలంగగా, ఎల్లముడులు
సడలగా, ఎల్లయెల్లలు చదునుగాగ
నీ మహానందవనములో 'నీవు నేనె'
యను నతడు ముక్తుడనుచు బ్రహ్మర్షిమాట.

నీతి పద్ధతి గరువాన నిట్టనిలుచు
తావులం దెల్ల ప్రేమ మస్తకము వంచి
ఓర్చి గెలుపొంది పై కొన నేర్చుననుచు
అలరు తేనియ మూట బ్రహ్మర్షిమాట.

తల తరణికాంతి, నిరులచాయల పదమ్ము -
గోపురమునకు మన బ్రతుకునకు కూడ;
కావుననె మన్ను మిన్నుల కలయిక యగు
మానవుని మన్కి యనుచు బ్రహ్మర్షి మాట.

## అందవోయి నాకు

నిఖిల రాజేంద్ర మకుట మాణిక్య ఘృణుల
పరమయోగీంద్ర వీక్షణోజ్జ్వలన మణుల
నీ పదము రంజిత మ్మేమొ! నీ గళమ్ము
దీనతృణ పుష్పమాలి కాధీన మోయి!

విగత భూషుడవో! దీనవేషివో! అ
నంత తారా సుధాంశు మార్తాండ కిరణ
కటక చరణుడవో! నన్ను గన్న తండ్రి
వో! ఇకెవ్వరవో! అందవోయి నాకు!

ఈ యహంకార మెంతటి దోయి, దేవ!
నీ చరణ ధూళులకు దిగనేర నేను;
ఈయశక్తి నా దెంతటిదోయి, దేవ!
నీ దయాంకమ్మునకు లేవనేర నేను

దూరదూరాల ప్రాంగణ తోరణాల
గాఢ లజ్జా భరాలసక్రాంతి వచ్చి
నిలిచియున్నాను, నా నీడ నేనె యొదిగి
ప్రాణనాయకు మంగళాహ్వానమునకు!

కడుగవా దేవ! అక్షయ కరుణధార
ఖిన్నజీవమ్ము, కర్దమాంకితము దీని;
ప్రత్యుషస్సుషిమా హిమప్లావితమ్ము
పారిజాతమ్ము నౌదు నీ పాదపీఠి.

ఆరని గాంగజీవఝరులై త్వదుదార దయాపయస్విసుల్
పారు నెడారి జీవితములన్ ఫలియించును దేవ! స్వర్ణకే
దార సజీవ భాగ్యము! నితాంత నిశీథమునన్ చలించు వా
రారయనేర రోరిచి సమగ్రము యుష్మదనుగ్రహప్రభన్

## జరలేని దా యౌవనమ్ము నిమ్ము

దూరదూరాల నీహారతుంగశృంగ
మకుట మాణిక్యమో! ప్రభామండలమ్మొ!
పిలుచు నన్ను పదే పదే! నిలువలేను:
నాకు జరలేని దా యౌవనమ్ము నిమ్ము!

గండు శిల లివి చరణాలు, కనులు చీకు
చీకు చీకటిరేలు, ఏకాకిదారి
అంధ వైతరణీ ధార; ఆగలేను;
నాకు జరలేని దా యౌవనమ్ము నిమ్ము!

నా పదమ్ములు రెక్కలు, నయనయుగళి
ఆరిపోవని తారలు, యాత్ర శిశిర
మధుర మధుజీవవాహిని; మసలలేను;
నాకు జరలేని దా యౌవనమ్ము నిమ్ము!

వెలుగుతో, ఇరులతో, మధువీచితోడ,
మరుగు విషకీల తోడ, సుమధుర మధుర
మైన బ్రతు కిది కల్పమ్ములేని వలయు;
నాకు జరలేని దా యౌవనమ్ము నిమ్ము!

(స మా ప్తం)